శ్రీరామాయనమః.

# శ్రీ కౌసల్యాపరిణయము.

శ్రీ గుడ్లదొటి వీరన్న బ్రహ్మశాస్త్రి పెద్దన్న

వావిలికొలను సుబ్బరాయ ప్రణీతము. 1903-1991.



ఇది




శ్రీమద్వినిగడప, ఉంగ్రాజవరములోనగు తాలూకాల జమీన్దారులైన
మహారాజరాజశ్రీ

శ్రీరాజా వెల్లంకి వేంకట రామారావు బహద్దర్ గారిచే
గౌరవవశంబున దొలుత ప్రకటితమై

చెన్నపురి,

సోల్డర్ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

మూడవ కూర్పు.

1929.

# మొదటికూర్పు పీఠిక.

శ్రీ కౌసల్యాపరిణయ మను నీకావ్యమును హూణశకాబ్దము ౧౮౯౪-వ సంవత్సరము మార్చి నెల ౧౬-వ తేదికి సరియయిన విజయ సంవత్సర ఫాల్గున మాస శుద్ధపక్ష ౧౦ శుక్రవారంబున గడపమండలమందలి రాజంపేటతాలూకా యోబలి గ్రామము గణకవరుండగు బ్రహ్మశ్రీ గౌరవరము చెంచయార్యుచే నిర్దిష్టమైన శుభ ముహూర్తంబున మాతృప్రేరణంబునను మిత్రబోధంబునను బ్రారంభించి, ౧౮౯౪-వ సంవత్సరము నవంబర్ నెలకు సరియైన జయసంవత్సర కార్తికమాసంబున సాంతంబుం గావించితి. ఇది యస్మన్మిత్రులకు సువిదితమ. అప్పుడు కడపమండలమునందలి రాజంపేట తాలూకాలోని పొత్తపి నాటిలోఁజేరిన టంగుటూరను గ్రామమునందుఁ బ్రథమరైవిన్యాసపరీక్షకుఁడు (రివిన్యూ ఇన్‌స్పెక్టర్) గ రాజకీయోద్యోగంబున నుంటిని. దీని వ్రాఁతప్రతిని గృతిపతియగు భద్రాచలరఘుపతికి సమక్షంబున సమర్పించి పదంపడి ప్రకటింప నెంచి వెంటనె ముద్రింపఁ బూననైతిని. అనంతరము సంప్రాప్తమైన ప్రభూతప్రత్యూహవశంబునను, క్షయఘపీడాజనితజీవనవిపర్యాసంబునలనను, నాకోరిక నెఱవేఱదయ్యె. "అన్యథాచిన్తితం కార్యం, దైవమన్యత్ర చిన్తయేత్" త్తనుట సుప్రసిద్ధమే కదా ఇట్లుండ భగవదనుగ్రహమువలనను, మ-రా-రా-శ్రీ, సమర్థి రంగయ్య శ్రేష్ఠి బి.ఏ., ఎఫ్. యమ్. యు., గారి సాహాయ్యమువలనను, నీ తిరువల్లిక్కేణియందుండు హిందూపాఠశాల యధ్యక్షుల కరుణను, నేనీ యుపాధ్యాయోపజీవికానుసారి నైతినిగాని ప్లవ యంతయు నా కుపప్లవకారియ యయ్యె. పెక్కుమాటలేల, నాజీవుం డెన్నివారంబులో నాకద్వారకవాటనోద్యమపరుం డయ్యెంగాని తద్ద్వారరక్షకులచే విఫలీకృత ప్రయత్నుండయ్యె. ఎక్కటి నిట నిట్టి యిక్కట్ల నుండ "మిత్ర మాపత్సుజానీయా" త్తనునానుడి సరిదాఁక నస్మన్మిత్రులగు బ్ర॥శ్రీ మ-రా-రా-శ్రీ, లంకలపల్లి వేంకట సుబ్బయ్య ఎం. ఏ. గారును బ్ర॥శ్రీ. మ-రా-రా-శ్రీ, కొత్తపల్లి వేంకట పద్మనాభశాస్త్రిగారును నొసర్చిన నిశ్ఛిద్రసాహాయ్యంబునన యొడలఁ బ్రాణంబు లెట్టెట్టో చిక్కంబట్టియుండితింగాని తుద కది దుస్సాధమనియెంచి యవివాహితకన్యవోలెనున్న యీకావ్యకన్యంగాంచి దైవకృపరాదాయె దీని న్ముద్రించి కనులారఁగాంచు భాగ్యంబు లేదాయె, నని చింతించి మీఁదఁ జేర్కొనిన మిత్రులకు దీని మీరు మైత్రికారణంబునన నాయనంతరము ముద్రింపించి ప్రకటింపుఁడని యప్పగించి జీవజీవనంబులపై నాశ చాలించి నాయభిజనం బగుకడపకుఁబోయితి. ఆహా! దైవతంత్రము!!

"యచ్చిన్తితం తదిహ దూరతరం ప్రయాతి
యచ్చేతసా నగణితం తదిహాభ్యుపైతి."

కం. సుఖవుగ నగు నని యెయ్యది
దలఁతుమొ యది యేగు మిగుల ♦ దవుదవ్వగుచుం
గలలోనే నెది యగు నని
తలఁపమొ యది యప్పు డగును ♦ దైవవశమునన్ !

అచ్చటఁ దురుష్కోత్తమకులసంభవుండును, శాంత్యౌదార్యాది సుగుణగణవిభవుండును, ప్రతిఫలాపేక్షారహితమనీషాభేషజప్రదానకళామాననీయభిషగ్వరుండును, నగు నన్నేమియ్యా నాపాలిజియ్యగ నెయ్యంబున నన్నుఁ గ్రమంబునఁ బునర్జీవితుం గావించె.

నేనిట్టి యాపన్నదశ నుండ నిట బ్ర॥ శ్రీ. వేంకటపద్మనాభశాస్త్రులుగారీకృతి సాంతంబుగఁ బఠింప నెంచి యెడపాడడపా చదువుచు నా సమయమున నీ పట్టనమునకు విజయము చేసియుండిన వీరిప్రభువురాలును, శ్రీమత్కోటంక వీరవరములోనగు తాలూకాల జమీందారురాలును, నగు మహారాజరాజశ్రీ శ్రీరాజారావు చెల్లయ్యమ్మారావు బహద్దరువారి దర్శనార్థమై వారి సన్నిధానమునకు వెళ్లుచు దీని వెంటంగొని చనిరఁట. అప్పు డచ్చట శ్రీరాజా రావు చెల్లయ్యమ్మారావు బహద్దరువారి సోదరులును, శ్రీమద్వీనిగడప ఉండ్రాజవరములోనగు తాలూకాల జమీందారులును నగు మహారాజరాజశ్రీ. రాజా వెల్లంకి వేంకట రామారావు బహద్దరువారును, వారి భాగినేయులును శ్రీమత్పిఠాపురసంస్థానప్రభువులును నగు మహారాజరాజశ్రీ శ్రీరాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరు జమీందారువారును నుండిరఁట. ఆప్రభుయుగం బది యేమి గ్రంథంబని యడిగెనఁట. శ్రీకౌసల్యాపరిణయం బనుదుఁ గొంత చదువుఁ డనియన వేంకటపద్మనాభ శాస్త్రులుగారును గొంత చదివిరఁట. పిమ్మట రాజా వెల్లంకి వేంకటరామారావు బహద్దరువారిది యెక్కడఁ గొననగునని యడిగి యముద్రితంబని తెలిసికొనిరఁట. పదపడి యొకనాఁడు వారు మైలాపురిలోనుండు తమవసతికి శాస్త్రులవారిని బిలిపించి యీగ్రంథము సాంతంబుగఁ జదివించి విని దీనికి ముద్రాభృతి మే మొసఁగెదము దీనిముద్రింపఁ బ్రయత్నింపుఁ డన నిది జీవత్కవికృత మనియు, నాకవిగారి సమ్మతి నొందెద ననియు శాస్త్రిగారు చెప్పిరఁట. ఈవిషయమంతయు ౧౯౦౧-వ సం॥ అక్టోబరునెల ౧౯-వ తేది గల లేఖామూలకముగ శాస్త్రులవారు నాకుఁ దెలియపఱిచిరి. నేనును శుభోదర్కంబున కిది యంకితార్పణంబుగ నెంచి యట్లు కావింపుఁడని ప్రత్యుత్తర మిడితి. వారును దీనిని బహుప్రయాసమున కోర్చి ముద్రింపించిరి. మహారాజరాజశ్రీ రాజా వెల్లంకి వేంకట రామారావుబహద్దరు జమీందారువారిని నాపాలివేల్పుపురిగొల్పెనని నెమ్మది నమ్మెద. కానున్నచోఁ గడపమండలవాసి నే నెక్కడ ? కృష్ణామండలస్థులగు నీప్రభువుగారెక్కడ? ఎన్నియో యుత్తమగ్రంథములం బఠించిన వీరికి నాకృతి రుచించు టెట్లు? నేటికాలపుఁబ్రభువులకు నాంధ్రవిద్యాభిమానముండు టెట్లు ? ఉండెఁబో దానికై

ధనవ్యయముచేయ సాహసికు లగుటెట్లు? అయిరిపో యయాచితంబుగ నన్యులకృతికి ముద్రాభృతికై వందలు వెచ్చించు నుదారు లగు టెట్లు?

ఈ కావ్యకన్య జన్మప్రభృతి శ్రీరామచంద్రునకు మన్మనోదత్తయయ్యు నష్టమ వర్షంబునం గాని వివాహయోగ్య గాదని కాంబోలు నేఁటివఱకు నావేల్పు బాహిరంబుగ దీని నంగీకరింపక యుండె నని తోఁచెడి.

ఇంతకాలము నన్ను సెలవుపైనుంచి యిప్పుడు నా దేహంబు స్వస్థతఁ గాంచుట వలన మరల హిందూపాఠశాలాధ్యక్షులు నాయందు దయగలిగి నన్ను నీకొలువునఁ బ్రవేశపెట్టిరి.

ఇట్టి మహోపకృతులు నా కొనరించినపై సుకృతుల కొక్కరికేని నే నెట్టి ప్రతికృతియుఁ జేయఁ జాల. ఇన్ని దుష్కరంబుల సుకరంబులుగ నొనర్చిన యఘటన ఘటనాచాతురీధురీణుం డగు శ్రీరామచంద్రుఁడే వారి యోగక్షేమభారంబు వహింపఁ బోరిం బోరి నాదైవంబుఁ బ్రార్థించుచున్నవాఁడ.

ఆ. వె. దైవకృతము లిపుడు ♦ భావింప విష మయ్యు
మీఁద నామతమున ♦ మేల యిచ్చు.

అని నే నేనాఁడో వ్రాసిన దానికి శ్రీకౌసల్యాపరిణయము కరణి. శ్రీకౌసల్యాపరిణయంబు లక్ష్యమై పరిణమించెను. రాల నీటఁ దేలించిన మేటి కసాధ్య మెయ్యది?

శ్రీకుమారాభ్యుదయము వ్రాసి ముగించిన పిమ్మట నొక్కనాఁడు రాజంపేటలో నేను "శిరస్తాదార్" పదవియందు నుండుతఱి నాజనయిత్రి తాను గోటతికమునకు వచ్చిన క్రొత్తలోఁ బిన్నవయసున నున్న నాపితృవ్యులు మహారాష్ట్రభాషలోని కౌసల్య పెండ్లికథను జదువుచుండఁ దాను వింటిననియుఁ, జిరకాలమున వినికియగుటఁ గథయంతయు మఱచితి ననియు, దానిం గృతిగా నొనర్పు మని యందదుకులుగఁ గొంతకథ చెప్పెను. విన్నంతవఱకు నది వింతగ నుండుట సంపూర్ణంబుగ దాని నెఱుంగఁగోరి యప్పుడు నాయెఱింగిన మిత్రులకును, బండితులకును, సంస్కృతాంధ్ర పుస్తకవిక్రేతలకును, వ్రాసితిఁగాని మనోరథము మాత్రము సఫలము గాదయ్యె. ఇట్లుండ ౧౮౯౩-వ సంవత్సరమున శ్రీకుమారాభ్యుదయముం బ్రకటించితి. తదనంతరము వేంకటగిరిలోనున్న బ్ర॥శ్రీ. మ-రా-రా-శ్రీ లంకలపల్లి వేంకటసుబ్బయ్యగారు లేఖాపరిచితులగుట వారికి నాసంకల్పం బెఱింగింప వారు దామామహారాష్ట్ర గ్రంథంబుఁ బఠించితిమని యాకథాంశంబు లేఖామూలకమున నెఱింగించిరి. ఆ యుత్తరమును మాతృకగాఁ గొని నే నీకృతి రచియించితి.

ఇందలి కొన్నివర్ణనములం దిప్పుడు కొంచె మప్రస్తుత మగపడుచున్నదని తోఁచెనేని యవి గ్రంథ విరచనకాలమునకు ప్రస్తుతములుగా నుండెనని చదువరులు గ్రహింతురుగాక.

నా వ్రాఁతప్రతిలోని రమారమి ౧౦౦ పద్యములు క్లిష్టముగ నుండుటచేతను బూర్వవర్ణనాసామ్యము నొందియుండుటచేతను నీముద్రితప్రతియందుఁ దొలఁగించితిని గాని యాఱవ యాశ్వాసమునఁ గడపటఁ గొన్నిపద్యము లెక్కువగఁ జేర్చితి.

౩-వ యాశ్వాసంబున * గుర్తుగల పద్యముల కన్నింటికి నప్రస్తుతంబగు రామాయణార్థము గలదు.

ప్రత్యాశ్వాసాంతపద్య ప్రథమపాదప్రాసాక్షరంబులఁ గ్రమంబుగఁ జూచిన "కౌసల్యావివాహం" "రామార్పణమస్తు" అని యేర్పడును.

శ్రీకుమారాభ్యుదయంబునకు మత్కర్తృత్వము నొకానొకఁడు సందేహించి కారణముననట్టికుశంకల కెడమీయకుండుటకై ౧౨-వ పుట ౧౪౫-వ పద్యంబునను ౩౮-వ పుటలో ౯౯౪ చక్రబంధపద్యంబునను, ౫౩-వ పుట ౧౧౩-వ పద్యంబునను ౧౧౩-వ పుట ౫౧-వ పద్యంబునను, నింకఁ గొన్నిపద్యంబులను నాపేరిమిడ్చితి. ౫౦-వ పుట ౮౩, ౫౧-వ పుట ౮౭, ౮౯, ౯౨-వ పుట ౭౪, ఇట్టిపద్యముల కర్థము కాదినవేత్యాది సంఖ్యా సూత్రంబులంబట్టి గ్రహింపవలయును.

ఆంధ్రభాషాస్థితి యిప్పుడు కొంచె మభ్యుదయోన్ముఖ మగుచున్నట్లు తోఁచుచున్నది గాని

"కం. వెలయాంధ్రు రెందఱైనను
గులకాంతకు నీడుగారు కువలయమందున్
బలువిద్య లెన్నియైనను,
గులవిద్యకు సాటి రావు ♦ గువ్వలచెన్నా"

యన్న యసమానవాక్యమును మఱవక తమదేశము నభ్యుదయంబునకును గమమైహికాముష్మిక లాభంబులకును, నిదానమైన మాతృభాషకు, సంపూర్ణగౌరవముఁ జూపుబుద్ధి భగవంతుఁ డెప్పు డాంధ్రుల కొసంగునో.

నే నీకృతి రచియించిన పిమ్మట నాపరిచితు లొకరు, శ్రీపాద వేంకటాచలకవి ప్రణీతమైన శ్రీకౌసల్యాపరిణయంబను ౫-వ ఆశ్వాసముల గ్రంథమొం డిదివఱకే యున్నదని యొకముద్రితప్రతి నంపిరి. దానింజూడ దానికిని దీనికినిం గృతిపేరునను, నాయికా నాయకనామములను, మాత్రము సామ్యముండెనుగాని కథావిషయంబున నించుకంతయు సంబంధములేదు. మఱియొక కౌసల్యాపరిణయ మనుయక్షగాన ప్రబంధము ప్రకటనమును వార్తాపత్రికలంజూచి దానిం గొని చదివితిని గాని యది కథయందు మాత్రము కొంచెము సామ్యము గలదై యుండెను.

శ్రీకుమారాభ్యుదయమును బ్రకటించినపిమ్మట దానిం జదివిన పరిచితాపరిచితులగు పండితమిత్రులు నది మిక్కిలి కఠినశైలిఁ బండితైక వేద్యంబుగ వ్రాయఁబడినదనియు, నీతూరివ్రాయఁబడు గ్రంథమును గాలానుగుణముగఁ గొంచెము సులభశైలి రచియింపుమనియు, బోధించిరి. వారి హితబోధ ననుసరించి సులభశైలిని నీకృతి నిర్వహించితి. ఇంతకు సులభశైలి కావ్యములకు రుచింపదని తలంచెదను.

అయినను దీనిపై సజ్జనాభిప్రాయ మెటులుండునో యారసి వలసినచో నిఁకమీఁద దాని ననుసరించెద.

వర్ణనాంశములయందు సాధ్యమైనంతవఱకుఁ బ్రకృతి ననుసరింపఁ బ్రయత్నించితిఁ గాని యీయుద్యమ మెంతవఱకు సఫలమయ్యెనో చదువరులకే యెఱుక. యువతి ప్రత్యంగవర్ణనాదుల కిందు వలసినంత యవకాశ మున్నను బ్రకృతకాలమునం దవి రుచింపకుండుట యటుండ నవి పాపావహంబనియు నెంచి వానిని మానితి.

ఈకావ్యమునకు మూలగ్రంథం బీపేర నెసఁగుచున్న దని వినుటచేతను, బరిణయమే కథ కంతకును బీజభూతంబగుటను, దీనికి శ్రీకౌసల్యా పరిణయం బను పేరిడినను బరిణయభాగము మాత్రము మిక్కిలి యల్పమైయున్నది. (మృచ్ఛకటికవలెనిది యెంచంబడుం గాక.) కావునఁ బరిణయనామమాత్రమున శృంగారవర్ణనాభూయిష్ఠ మని తలఁచి యెవ్వరేని గర్హింపకుందురు గాక.

పూర్వకవీశ్వరులు ద్రాక్షానిత్రోవలును, నూహింపనివిషయములును, లేవు. అయినను సాధ్యమైనవఱకు నూతనవర్ణనములే వ్రాయఁ బ్రయత్నించితి. నేనుగ్రొత్తగ నూహించి వ్రాసినాఁడ ననియనుకొన్న వర్ణనములు కొన్ని పదపడి సంస్కృతాంధ్ర కావ్యములంజూచి యట్టివానినెల్లఁ దొలఁగించితి. ప్రమాదంబున నింకను నట్టివి తప్పియుండిననుండవచ్చును. ఈనియమము పద్యశైలియందును నవలంబింప సాధ్యమైనంత వఱకుఁ బ్రయత్నించితిని గాని గుణపక్షపాతంబును దుర్భేద్య చిరతరపఠనాపరిచయబలకారణంబునను గొన్నియెడల దీనిం బాటింపమి నెఱుంగుదు.

ఈగ్రంథమునందలి గుణాగుణవిమర్శలకు సమచిత్తులగువిపశ్చిత్తులే శరణము. సజ్జనులు స్వభావముగ గుణగ్రహణపరాయణులగుట వారర్ప్రార్థితు లయ్యు గుణమునే గ్రహింతురు. అట్టివారికి విధేయుఁడనై నమస్కరించుచున్నాఁడను. "ప్రమాదో ధీమతా మపి"యనియుండ నిఁకనాయట్టి కించిజ్జ్ఞునకాప్రమాదము లేక యుండును.

---

ఈగ్రంథమునుబ్రకటింపఁగలుగుటకై ధనసాహాయ్యమొనర్చిన మహారాజరాజశ్రీరాజా వెల్లంకి వేంకటరామారావు బహద్దరుజమీందారుగారికి నాయురారోగ్యైశ్వర్యాద్యభ్యుదయంబు లొసంగ భగవంతునిఁగూర్చి యిట్లు ప్రార్థించుచున్నాఁడ.

పంచరత్నములు.

---

సీ. శ్రీకరుణామధు♦శ్రీమీఱుపుష్పవ♦ద్విస్ఫురన్నేత్రాబ్జ♦విలసితుండు
ఫూతధీనిత్యవి♦భూతిదానవినిద్ర, పద్మానిమేషాక్షి♦ప్రాణవిభుఁడు

మారుతసుతసర♦మావల్లభులకు న, మర్త్యత్వమొసఁగిన♦మానధనుఁడు
గౌతమప్రియవధూ♦ఘనజాడ్యహరుఁడగు, నతభవామయతాప♦హృతిచణుండు
రాజు వెల్లంకి వేంకట♦రామరాయ, బహాదరంకితుఁ బెంపాల♦బహితగోత్రు
రేయుఁబవలును బ్రోచుత♦శ్రీచిరాయు, రతులితారోగ్యవిభవసం♦గతునిఁ జేసి. ౧

తే. క్షీరనిధిజాత, యిందిర, ♦ శ్రీవధూటి, భువనమాత, రమాదేవి♦పూర్ణకృపను
రాజకులజాతవేంకట♦రామరాయ, మందిరావాస యగుత న ♦ క్తందివంబు. ౨

ఉ. శంకయొకింతలేక యని♦శంబు విరోధివరూధినీహృదా
తంకకరంబు, స్వాశ్రితసు♦దర్శన మైనసుదర్శనంబు వె
ల్లంకి కులాబ్ధిసోము, నక♦లం. కనుజాతనుజాతసంగతున్
వేంకట రామరాయ పృథి♦వీపతి విశ్రుతకీర్తిఁ బ్రోవుతన్. ౩

సీ. రాజకులాంభోధి♦రాకాసుధాంశు భా, వుకశీలగుణజాలు ♦ సుకలుఁ బెంపు
చెలఁగ సంతతబుధా♦శీర్వచనకలితో, ల్లాసమానసు, దయా♦భాసమాను
యదుకులప్రవరపా♦దాంబుజాసక్తస, న్మానితచరితు దు♦ర్మానరహితు
రాజిత నిర్జరాం♦ధ్రిక ళాబ్ధిమ థనభ, వుకసుధాస్వాదన♦పూతచిత్తుఁ
శ్రీమ వెల్లంకి వేంకట♦రామరాయ, మహిపవర్యుని నసమాన♦మహిముఁగాఁగ
బ్రోచుఁగావుత నిరతంబు♦బుధవినుతుఁడు, చుట్టుఁగైదువువలమురిఁ♦బట్టుప్రోడ. ౪

---

సీ. విశ్రుతసత్కీర్తి♦పెదరామ రాయఁడే, పూతచరిత్రుని♦తాతతాత
ఘనతరసమ్మాన♦ధనుఁడు మల్లారావు, ధాత్రీశుఁడేప్రభు♦తాతతండ్రి
విబుధసంస్తవనీయ♦వేంకటకృష్ణరా, యండేదయాశీలు♦తండ్రితండ్రి
గణనీయగుణుఁడుజ♦గన్నాథరాయఁ డే, దానశీలాత్ముని♦తండ్రి యట్టి
రామపదభక్తు వేంకట♦రామరాజ, విభువరేణ్యునిఁబ్రోవుత♦విశ్వధర్త
భక్తశుభకర్త నతలోక♦పంకహర్త, జానకీభర్త కరుణచే♦సంతతంబు.

తిరువల్లిక్కేణి
1902 సం॥
మే నెల 4-తేది.

సుజనవిధేయుఁడు,
వావిలికొలను సుబ్బరావు.

శ్రీరామాయనమః

శ్రీ శారదాయైనమః

# శ్రీకౌసల్యాపరిణయము.

## ప్రథమాశ్వాసము.

### ఇష్టదేవతాస్తుతి.



నారాయణనిత్యముక్తశుభగో♦ష్ఠీసభ్యతావాప్తికిన్
ధ్యానింతుం జతురాత్ము, సంసరణవి♦స్తారాబ్ధినిస్తారకున్
శ్రీనాదాత్మకు, శ్రీనివాసు, హరి, ని♦శ్చింతాప్తి నాత్మోద్భవా
స్తానాశోద్యమవైరిసంహరణకౌ♦శల్యాయనున్, రామునిన్. ౧

సీ. ఏసతిశీలంబు ♦ హృదయంగమంబునై, రాము నిస్తులయశో♦ధాముఁ జేసె
నే రమణీమణిఁ ♦ గూరిమి లోఁదాల్చి, పాంసుల రత్నగ♦ర్భగ రహించె
నేకరుణాలయ ♦ హింసింప నెంచిన, పలువ కిప్పించె న♦వ్యయసుఖంబు
నేభక్తవర్గాల♦యేపారుకరుణచేఁ, జెనఁటికాకము చిర♦జీవి యయ్యె

ఆ. నాపిపీలికాజ ♦ మేపురంఘ్రిలీల, యేమె శ్రితులఁ బ్రోవ ♦ నెదురుపోవు
నట్టిమాత, త్రిజగ♦దవగీర్ణగుణపూత, సీత నన్ను ధన్యుఁ ♦ జేయుఁగాత. ౨

సీ. మూఁడువేదంబులు♦ముప్పిరి నల్లిన, వేణితోఁ గృతిఁదాల్చు♦పాణితోడ
వెన్నెల గ్లురియించు ♦ వెల్లనివలిపంపు, టొల్లెతోఁజిన్ని జా♦బిల్లితోడఁ
జేదోడువాదోడు♦చెల్వారుముద్దుల, చిలుకతో మురిపెంపుఁ♦బలుకుతోడ
సరిగమపధనిస♦సధపమగరిస య. స్వనతో నిర్జరీ♦శ్రేణితోడ

తే. వ్రాలువిరిచూలునిల్లాలు ♦ పూలనాలు, దాల్పుప్రోయాలి కేరాలు♦వేల్పుచాలు
నేలు విద్దెలజవరాలు ♦ మేలుగ్రాలఁ, జాల నాపాల నిల్చి న♦న్నేలుఁగాత. ౩

మ. ధవు సర్గాఽప్రతిభాత్ముఁ గాంచి నిజమ♦ధ్య, స్వాదునిశ్వాస, స
చ్ఛవి, లావణ్య, నితంబసామ్య మొనరం ♦ జల్పంగ బోధించినన్
దివి, వాతా, గ్నిపయఃకుచక్రములఁ దా ♦ నిర్మింప శాలీనుఁడై
నవువాణిం గవుఁగింటఁజేర్చు నజు స్వాం♦తంబందు భావించెదన్. ౪

ఉ. నీరసయుక్తిరక్తిను ♦ నీమధుధర్మము నిర్మలత్వముం
బేరువహించుమేనఁ బ్రభ♦వించుటయుం గన సాటి యెవ్వరే

బోరన గౌరినిందలను ♦ బూనఁగ నాపగ నేర్తు నెట్లు మైఁ
జేరుపనంచుఁ దా సవతి♦చేడెల నొక్కట నూఱడించు సం
సారి హరుండు నాబహుళ♦సంకటముల్ హరియించుఁ గావుతన్.

ఉ. వైరిగదా మరుండు మగు♦వా! తగవౌనె తదంకపాళులం
జేరుప నంగపాళి మదిఁ♦జింతిల కింత? యనం గపాలితోఁ
గూరిమిఁ గూర్పఁగా మనలఁ ♦ గుంభినకాఁ డగు నాయనంగుఁడున్
వైరియె? యంచు నవ్వెడుభ♦వాని దయన్ శుభవాణి నిచ్చుతన్.

తే. ఎవని ముదలార సేవింతు ♦ రెల్లవిబుధు, లెవనిముద లారసి చరించు♦నెల్లనట్టి
మొదటితలయారి శ్రీసేన♦మొదలియారి, మీఱునుద్భవములఁ ద్రుంచు♦మేలు వెం

ఉ స్వాంతమునన్ భజింతు గుణ♦వంతు, మహాబలవంతు, దైత్యశు
ద్ధాంతతమాలపత్రఘటి♦తాంతుని, దాంతుని, శాంతు, దుష్కృత
ధ్వాంతఖరాంశుమంతు, వసు♦ధాతనయాఘనశోకశాంతు, ధీ
మంతు, దయానిశాంతు, హను♦మంతు, నతాయవనీవసంతునిన్.

కం. సకలకళాధారు శర, త్సకలకళాధామరుచిని ♦ సైంధవగళునిన్
శకలీకృతసైంధవగళు, సకలు న్ననుఁ జేయ భక్తి♦సన్నుతియింతున్.

## సంస్కృతాంధ్రకవీంద్రవినుతి.

ఉ. భారతి యేమహామహుని ♦ వాక్కునురంగమునందు సద్యశో
భారతినాట్యముం జలిపెఁ ♦ బాత్రమునాఁ దొలుదొల్త హర్షశో
భారతి మీఱ నందెలర♦వంబులు కర్ణరసాయనంబుగా
నాఋషి నేఁ దలంతుఁ గవి♦తామరశైవలినీత్రివిక్రమున్. ౧

కం. ఖేదముఁ దొలఁగింపఁగ స, మ్మోదము ఘటియింప భోగ♦మోక్షశ్రీ లా
పాదింపఁగఁ జాల్పంచమ, వేదము రచియించు నపర♦విధు నేఁ గొలుతున్. ౧

తే. కాళిదాసకవీశ్వరు♦ఘనుని దండి, పండితుని దండి, జయదేవు♦బాణు, మాఘుఁ
జోరుని, మయూరు, భవభూతి♦భారవి, మది, సుకవిలోకేశులను గొల్తు♦సూక్తులాద

ఉ. భీముని, నన్నపార్యు, నెఱ♦ప్రెగ్గడఁ, దిక్కన, నాయథర్వణున్
సోము, ననంతుఁ, బెద్దనను ♦ సూరన, భాస్కరుఁ. బోతసత్కవి
గ్రామ కవీశు, వెండి సిరి♦నాథునిఁ, దిమ్మనఁ, బిన్నవీరనన్
రామనృపాలభూషుఁ, గవి♦రాజుల నెంతుఁ బ్రశస్తసూక్తికిన్. ౧

కం. సాధునికరవంద్యుల నే, నాధునికకవీశులన్ మ♦హాత్ముల మది నా
రాధనకయి తెలుతున్ గం, గాధునికాభంగభంగ♦గంభీరోక్తిన్. ౧

వ. అని దేవతావందనంబును, బురాతనాధునాతనసత్కవీశ్వరానందనంబును గావించి
జన్మసాఫల్యంబుగ నొక్క పుణ్యకార్యంబు రచియింపఁదలంపు చెంగలింప నుద్యమించి.

చం. కవియును నర్తనాంగనయు ♦ గష్టము లెంతలు గల్గియున్న న
య్యవి వెలిఁ దోఁపనీక వెల ♦ యున్ వలయున్ వెలినాడు నర్తకిన్
భువిపయిఁ జూపఱు ల్గనఁగఁ ♦ బోరు హృదంతరవర్తివేదనన్
నెనమిడి లోపమే దెగడ ♦ నేర్తురు నిష్ఠురవాక్పరంపరన్. ౧౬

సీ. చిత్తమా యాదరా ♦ యత్తమై గ్రాలదు, పాత్ర మాయాదరా ♦ వృత్త మగుటఁ
గరము విచక్షణా ♦ కరములు గానియక్కరముల వ్రాయు నా ♦ కరము లెపుడు
పాదము ల్గర్కశ ♦ పాదకంటకశిలాక్షోదముల్ యాతనా ♦ పాదము లగు
దేహంబు రోగసం ♦ దోహంబు బలిమి మం, దేహంబు బ్రదుకె సం ♦ దేహ మగును

తే. ఇట్టినను బోఁటి మానిసి ♦ కెట్టు లొదవు, విబుధహృదయంగమాలాప ♦ వివిధచతుర
నటన ఘటనాపటు స్ఫుట ♦ కటకపటల, క్రమఝుళంఝుళారావ ♦ కావ్యకన్య. ౧౭

సీ. సరసుల సద్గోష్ఠిఁ ♦ దిరిగెడు కవిరాజ, హంసలఁ బదరాగ ♦ మరుదు గాదు
విబుధులసంగతి ♦ విహరించు రుచివిధా, శుకవుల నొప్పారు ♦ శుద్ధసూక్తి
బహుళభోగాభోగ ♦ పటిమనైన యహీనుఁ, డోపెడి బహురీతు ♦ లొప్పఁ బలుక
విషయానుభవయుక్తి ♦ వెలసెడివారికి, భావజాత్యున్నతుల్ ♦ పలుక సుళువు

తే. కంజదృక్కంజలోచనా ♦ కంజ రేద్ధ, మంజుమంజీరశింజాన ♦ పుంజ మింటఁ
బుంజిగొనియున్న భోగముల్ ♦ పొదలుచున్న, లలితకవితావిలాసిని ♦ యలరుటరుదె?

సీ. కలమెత్తి వ్రాయంగఁ ♦ గడఁగితినా గ్రామ్య, వచనభూయిష్ఠంబు ♦ వ్రాయసంబు
వీను లొగ్గి యొకింత ♦ వినియెద నందునా, బండుబూతులె చెవి ♦ నిండుచుండుఁ
గన్నులు విచ్చి నేఁ ♦ గనుఁగొందునందునా, కంటకతరుదరు ♦ ల్గానఁబడును
స్వచ్ఛందవృత్తిని ♦ జరియింతు నందునా, ధర నాథవంతుఁడఁ ♦ దిరుగరాదు

తే. కాననావాననసమాన ♦ మానభాస, మానసదరీణవర్ణనా ♦ మాధురీణ
భావనానూననూత్నసం ♦ భావనార్హ, శారదాదేవి యెటులుండు ♦ సంతసమున. ౧౯

వ. కావ్యరచన దైవపూజావిశేషంబుగ మనీషులు భాషించుటఁ గృతికృత్యంబునఁ గృతకృత్యుండ నయ్యెద నని తలంప నయ్యది పూర్వకృతాపూర్వసుకృతాధిక్యంబునం గాని నిరంతరాయంబుగఁ గొనసాగనేర దని సందేహమందేహుండనై డోలాందోళితమానసంబున నెయ్యదియుం దోఁపమి శ్రీరామధ్యానంబు సలుప నెయ్యది హృదయగోచరం బగు నద్దానిం గరణీయంబుగ నాచరించెదఁ దత్కరుణానిదర్శనంబు లనేకంబులు హృద్గతంబు లయ్యె జంక నేలయని దృఢచిత్తుండనై శ్రీరామ సాన్నిధ్యంబుఁ గల్పించుకొని యర్ధనిమీలితలోచనుండనై ధ్యానించుచున్న సమయంబున. ౨౦

సీ. రాహుగ్రహాస్యని♦ర్గళదబ్జమండలం, బన నొప్పు నెమ్మోము♦హారువ్రతోడ
గ్రీష్మసాయాహ్నసం♦దృశ్యమానం బగు, తనులతఁ దనులత♦దారసింప
నవహిమాత్యయవేళ ♦ నలివాయుకంజాత, ముల కన్నుకన్నులు♦పురు
గాననకృత్రిమ♦గర్తవినిర్గత, కరిణినా నిజ యాన♦కలన మమరఁ
తే. జెలఁగికుఱుమాపుచీరకు♦చ్చెళ్లు గునిసి, యాడమీఁగాళ్లఁ, గొనగోళ్ల♦ నన
చెదఱు వెంద్రుక; లొయ్యనఁ♦జేరవచ్చి, నిలిచె నొకలేమ మామక♦నిక ౧౨
వ. ఇట్లు మదీయోపకంఠంబుఁ జేరినయక్కలకంఠి నుపలక్షించి.
ఉ. ఆవిరి గప్పగా మినుకు♦టద్దమొకో, నునుమంచు సోఁకి పోఁ
వావిరిఁ దాటి తేఱు సిత♦వారిజమొక్కొ, దినాంతవేళలఁ
బోవుచునుండ నెండ పరి♦పూర్ణసుధాకరబింబమో, యనం
గా విరిఁబోణినెమ్మొగము ♦ కారణమేమియొ నాడి తేటెడ్డిఁ? ౧౩
సీ. దయ నాకు సిరు లీయ♦దయచేసినట్టి యా, లచ్చియందునొ మేను♦పచ్చ
పద్యముల్ నానోరఁ ♦ బ్రౌఢిమైఁ బలికించు, వాణినాఁ బుస్తక♦పాణి గాదు
జగతి భక్తులఁ బ్రోచు♦నగజాత యందునా, రుదురాక పేరు పే♦రెదను లేదు
మదనమోహిని యని ♦ మదిలోనఁ దలఁతునా, చిత్తవిభ్రమ మెప్డు♦ చే
తే. మహినిమహిళయందిట్టి♦మహి మయున్నె? వేల్పుఁగన్నియకెట్టులీ♦వెతలు
ననుచుఁదలపోసి యిట్లంటి♦నతినతోడ, నైజమునఁగురుభావంబు♦నయమ
ఉ. ఎవ్వతెవమ్మ నీవు? కత ♦ మేమి యొకో యరుదేర? నీమదిఁ
నెవ్వగ గూరియున్నగతి ♦ నీదుస్వరూపమె చెప్పెడుం గటా
నొవ్వఁగ నేరు పల్కరి ని♦న్నుఁ? నను ధన్యునిఁ జేయు తెల్లనా
గువ్వలయెక్కరింతగల♦కొమ్మవొ? యమ్మవొ తమ్మిచూలికిఁ? ౧౪
వ. అని తనయమానుషంబైన తేజోవిశేషంబుకతన భయభక్తిసంభ్రమంబులు
ముప్పిరిగొన మోడ్పుఁగేలునమిగులమాటాడనేరని నన్నుఁగనిసాదరంబుగ నాయం
యిట్లనియె. ౧౫
తే. అన్న! కన్నులవిల్తుని♦యన్నయన్న, గాఁగ నన్నెన్నుమీనిన్నుఁ♦గానఁ గాను
ముచ్చటైనను వచ్చితి♦ముచ్చటింతుఁ, గలదు నాదీనదశకును♦గారణంబు. ౧౬
ఉ. మానరచింత లొంది విష♦మవ్యసనావిలచిత్త నౌట సం
తోసములేమి నెట్లు పరి♦తోషముకల్మిఁ జరింతునో? యనా
శ్వాసితదుఃఖితే మనసి ♦ సర్వ మసహ్య మటన్నపల్కు వి
శ్వాసము గాదె? శోకసమ♦శాత్రవుఁ డుండున వేఱొకం డిలఁ. ౧౭

తే. ఆరురుత్తుండు క్రోధంబు ♦ నణఁచుభంగి, నబ్ధి బడబాగ్నిఁ దనలోన♦నాఁచినట్టు
లాఁపి మదిలోన నామనుమ♦రంతచింత, నననిపైఁ బుత్ర ! యిటు నడ♦యాడుదాన.

ఉ. ధారిణిఁ గృష్ణరాయలు తు♦ద నృలయాంధ్రరసాధినాథుల్
గారవమార నన్నుఁ గనఁ♦గా ఘనగౌరవవృత్తి నుంటి ము
న్నీరస నిప్పు డన్యగతి ♦ నీరస మొప్పఁగఁ జూడ నాప్రజల్
నీఁ సరూప మొప్పె ధర♦ణీసురసత్తమ! యేమిచెప్పుదున్. ౩౦

తే. ఆంధ్రనాథునిపాలితం♦బైనయట్టి, యంధ్రదేశంబునందలి♦యాంధ్రులెల్ల
నాదుతెనయులఁగా నెంతు♦మోదమొప్ప, నాంధ్రభారతి నే నౌట♦నవనివిబుధ.

కం. రాజన్యులచేఁ బూర్వము, పూజలుగొనువారు నాదు♦పుత్రకు లయ్యో !
రాజుల సేవకు లగు సి, స్తేజులఁ గొలిచెదరు నేఁడు ♦ దీనత్వమునన్.

వ. అదియైనను సజ్జనసేవయా యందువేని. ౩౩

కం. అధములు మతిగుణవిద్యలఁ, గ్రుధ సాధుల నేఁచ బ్రహ్మ♦కొడుకులు సుమి వా
రధికారులు గావుననో, యధికారులుగాఁ జరింతు♦రనుజీవులకున్. ౩౪

చ. కలుకువిలోకనంబుల నె♦గాదిగఁ జూచు, హసించు, నంచునన్
గొలిచినవారిఁ గాంచి కొలు♦కున్ రదముల్, నగుఁబోటుఁ జాటఁగాఁ
జులుకన నాడు, వ్రాయు, మఱి♦చూచును, లేచును దాఁప నిద్ది హా!
యులవగుసన్నిపాతగుణ♦మో, యధికారపిశాచవేషమో. ౩౫

సీ. ధరణీప రాగంబు♦ధరణీపరాగంబు, నమ్మితిరుగఁగరాదు♦సుమ్మి పతులఁ
బతిసహోదరము ల♦ప్రతిమహాదరములు, తబ్బిబ్బులౌ మది♦నుబ్బె నేని
వరచంద్రహాసంబు♦వరచంద్రహాసంబు, మెలఁకువ గలిగియు♦మెలఁగవలయు
నధికారకౌచితి♦యాధికారకచిత్తి, దూరంబునందె తొఁ♦దొలఁగవలయు

ఆ. బలుకరాదు నిజముఁ♦బలుకకపోరాదు, పోవరాదు మించి♦బుద్ధినుంచి
చిక్కనేని మిగులఁ♦ జిక్కుల నిడుదురు, కూళజనులకొలువు♦చాలబరువు. ౩౬

కం ఇట్టిడుములఁ బడుటను నా, యిట్టిగు లగుపట్టు లేమి♦యెంతచదివినన్
గుట్టుగ నున్నా రకటా, గట్టిగ ననఁ బట్టులేమిఁ ♦ గదుకొని కావన్. ౩౭

కం. ఈవిధి శ్వవృత్తిఁ దిరిగెడి, సేవకులే గాక మఱి య♦శేషజనంబుల్
నావలను చూడ రోసిరి, నే వగచెద దాని కెదను♦నిరతముఁ బుత్రా. ౩౮

కం. అందం బగుకొలజాబిలి, ముందలఁ గద మెఱయు నాకు♦మును పెప్పుడు, నేఁ
డెందెందుఁ జనిన మెడపై, నొందెందఁ గద యర్ధచంద్ర♦యోగం బకటా. ౩౯

సీ. నాపుత్రులే న న్న♦నాదరించుటఁ జేసి, యాహారముల మీఁది♦యాశ లేదు
నాకుఁ గూర్చునుతోళ్ల♦వీక నుండమిఁ గాంచ, నగలు మై సవరింప♦వగపుకలుగు

శరవాదపను లైన♦హరవాదులను గన్న, నగ్గిలేకయే కడ్పు♦భగ్గు మనును
దామసంబున కేఁగి♦తమలోనఁ గలహించు, తనయులఁ గన్నను♦ మనము పొగులు

తే. నాయనా! యేమియందును♦నాయవస్థఁ, బొలిచెఁ దలగడ యగుచు నా♦పుస్తకంబు
శౌమరుపీఁశియ చేయూఁత♦గోలయయ్యె, సుతసమూహంబులిటు సేయ♦సుబ్బరాయ!

తే. కురుల నైనను లెక్కింపఁ♦దరముకాని, యలవిగాదయ్య నాపుత్ర♦కుల గణింపఁ
బరఁగఁదల వెండ్రుకలయంత♦బలఁగముండిఁ, దలకుఁబోసెడిది క్కేడి♦తలఁపఁబుత్ర.

తే. ఆంధ్రు లెల్లెడ నన్యక♦ళాభిరతిని,
గులముఁ గులవిద్య మఱవఁగఁ♦దలఁచి తలఁచి
వెతలు గుడుచుచు నే నున్న♦విధము గాంచి,
తెలుఁగురాయఁడు జడనుయ్యె ♦ దిగులు చెంది. ౪౨

చ. కరము వసంతకాలికపి♦కస్వరచారుపికస్వరైకభా
స్వర మగునాగళస్వరము ♦ సంతతముం బస మేళనంబుగాఁ
బరఁగెడి, నేఁడు మందమయి♦భాసిల దయ్యె నుఖేతరస్థితిన్
వరలెడివార లేడఁ? బ్రతి♦భాయుతవాక్కు శలత్వ మేడనో? ౪౩

చ. తలఁపఁగఁ దాలమూ వదన♦తాలమె, మూర్ఛన లొందె మూర్ఛ. నిం
పలరఁగఁ జేయఁజా ల్లయ ల♦యంబును బొందెను, గ్రామ మక్కటా
చెలఁగెను గ్రామపర్యటన♦శీలత, నాదు తనూనుజావళుల్
వెలచెలి పాడుజావళులు ♦ విశ్రుతిఁగాంచె మహోన్నతస్థితిన్. ౪౪

తే. మదిని నన్నింత తలఁచెడి♦మానవుండు, గానరాఁడయ్యెఁ గొన్నాళ్ల♦గాన నేను
మూర్ఛలను స్రుక్కిసంచార♦ములనుదక్కి, రూపు చెడియుండితినిజమ్మి♦క్రూరదశను

కం. అటుపిమ్మట నటమటఁ గవు, లటనిట మహదాశ్రయంబు ♦ లలవడ కున్నన్
వటియింపకుండఁ బిమ్మట, ఘటియించుచుఁ గావ్యములను♦గాచిరి నన్నున్. ౪౬

కం. తక్కినవారికి నే ననఁ, గ్రక్కనకూడైతి నేమి♦కర్మమొ? యిది నీ
క్కొక్కింత దెలియుఁ గద నా, కెక్కడిముద మొదవు, సొగసు♦లేటికి నింకన్.

చ. కనదురుబంధబంధురము♦కావ్యమటన్నను రజ్జుబంధమా?
యనుదురు; సద్ధ్వమ ల్ఘనము♦లంచు వచింపఁగ గంగజాతరా?
యనుదు; రలంకృతు ల్బహుళ♦మన్నను ద్రాటనుగూర్చి కట్టెనా?
యనుదురు? నేఁటియాంధ్రులహా♦హా బవిసాటెఁ దెలుంగు బాసకున్. ౪౭

కం. చదివినమూర్ఖుని కంటెను, జదువనిమూఢుండు మేలు♦ చర్చింపఁగ దు
ష్పదముల నన్నుం ద్రిప్పెడు, చదివినమూర్ఖులను వశమె?♦ చక్కంబెట్టన్. ౪౮

కం. మార్గం బెఱిఁగియుఁ గడు దు, ర్మార్గంబునఁ జనుటకన్న♦మౌనమె మేలౌ
దుర్గంధసుమముకన్నను, నిర్గంధసుమంబుమేలు♦నిక్కం బరయన్. ౫౦

సీ. పాదముల్ దీర్ఘముల్♦ఛేదింపవలె నంద్రు, నాకు విశ్రమ మేల♦నడవ? నంద్రు
కొఱుసున్న మునుపీడఁ♦గొదువ యేమిట? నంద్రు, వర్ణసంకరవృత్తి♦వలయు నంద్రు
సద్వృత్తిరీతులఁ ♦ జాలసంకట మంద్రు, సద్ధ్వనుల్ దలయేరు ♦ సలుపు నంద్రు
శృంగార మేటికిఁ♦జీఁదఱకా? యంద్రు, ప్రౌఢోక్తు లతిగూఢ♦భావ మంద్రు
తే. వరశకుంతల ముద్దిచ్చి♦వఱలె ననఁగ, బల! సకుంతల ముడ్డిచ్చి♦బడలె నంద్రు
నేఁటి నవనాగరకకవుల్♦నూటి దప్పి, పద్యనియమంబు నందు నా♦భాసులగుచు.

సీ. బంధము ల్ప్రాకృప్రితి♦బంధంబు లంద్రు శృం, గారంబు లెల్ల వి♦కార మంద్రు
గర్భంబు వేదనా♦మర్భావ మని యంద్రు. మధురతామలరుచి♦మధ్య మంద్రు
వాక్యచాతుర్యంబు♦భావవక్రత యంద్రు, యమకంబు దుష్పథ♦గమక మంద్రు
బహువిధాలంకృతుల్♦భారమాత్రం బంద్రు, ప్రాసయోగంబు బీ♦భత్స మంద్రు
తే. వరపదన్యాసకుశలుని♦బంగు వంద్రు, చిత్రకవితావినోదంబు♦ఛీ యటంద్రు
వత్సపత్న్యుపలాలిత♦మత్తనయులు, భవ్యధీదీర్ఘదర్శితా♦భావు లగుచు ౫౨

సీ. ప్రత్యక్షరశ్లేష♦పటిమచేఁ జెన్నారు, వాసవదత్త కే♦వాసి తఱిఁగె?
యమకంబు నిండారఁ♦గొమరైనకాళిదా, సునళోదయమున కే♦సొబగు దప్పె?
గూఢభావనిరూఢిఁ♦గూడికర్కశవాక్య, భరితనైషధ మెట్టి ♦ వన్నె వాసె?
సకలకవిత్వకౌ♦శల్యంబుఁ జూపిన, మాఘున కేయవ♦మాన మొదవెఁ?
తే. గటకటా! యింతదలఁపక♦కుటిలయుక్తిఁ, దేర తేరకు నాదుకు♦మారకులను
దూఱుచుందురు బహువిధ♦దోషములను, దీని కేనేమివచియించు♦దానఁ జెపుమ?

ఉ. సాధులుగాని వెక్కులుల♦జల్పితముల్ గొని జాతివాక్యముల్
గా ధరణీసుపర్వ! కృతి♦గా నొనరించిన లెస్స యంద్రు; దు
ర్మేధను నట్టిఁడౌకవికి♦మేలిధనంబు లొసంగుచుందు రా
రా! ధనికుల్; మదీయగతి♦యయ్యయొ యెంతకు వచ్చెఁ జూచితే. ౫౪

తే. నేను దుర్దశఁ జెందిన♦దాన ననుచుఁ, బ్రౌఢకవితల నావృద్ధి ♦ దరఁగదనుచు
రచ్చకూఁతలెమిగులసా♦రస్యమనుచుఁ, బలుకుచుందురుమితిమీఱి♦బవిసిమాలి.

తే. శబ్దశాస్త్ర నిషిద్ధోక్తి ♦ సాధువగును, వినఁగను వినోదమైయుంట ♦ ననెదరేని
రతిసుఖంబునకై అంకు♦హితమొసలుప? సిరులకొఱకునుజౌర్యంబు♦చెల్లునొక్కొ?

మ. ప్రతిశబ్దంబు మథించి దానఁ గలసా♦రస్యంబునుం జూచి య
ప్రతిమానూనవిలాసచాతురి రహిం♦పఙ్ సౌష్ఠవస్ఫూర్తిమైఁ

గృతిరత్నంబు ఘటింప భాష నవసు♦శ్రీకాంతి శోభిల్లఁ గా
క తలంపం బొడిజల్లిమాట లన నే♦క్కాలంబున న్వృద్ధియా. ౫౭

ఆ. వాక్యసరణి వేఱు ♦ భావకౌశల్యంబు, సరణివేఱు; రెంట♦సరస మైన
కవిత కవితగాక ♦ కడమ యేదైననూ, సుకవు లెంచఁబోరు♦శుద్ధ మనుచు. ౫౮

కం. పామరతతికై వ్రాసిన, సామాన్యపుఁగథలు ప్రకృతి♦శాస్త్రము లుండక్
సామము సుఖమై; నగరే, ధీమహితులు కావ్యములను♦దీర్చిన నట్టుల్? ౫౯

తే. చాలనరులకు లెస్స పాం♦చాలి సుమ్మ, తఱచుపురుషోత్తములకు వై♦దర్భి లెస్స
యార్యజనులకుఁగౌడిసౌ♦ఖ్యంబుఁగొలుపు, లోకులిలభిన్నరుచులౌట♦ప్రాకటంబ.

చ. తలఁపకు చిత్రబంధకవి♦తల్ రచియింపఁగ రా దటం చెదన్
సలలిత కావ్యసంఘటన♦సారసనేత్రనమస్య గాదె? ని
శ్చలసుమనః ప్రకల్పితబి♦సప్రసవాదికరూపపద్యముల్
నలిననివాసినీహృదయ♦నాథున కప్పన సేయ దోషమే?

ఉ. కావున వీరివారివలెఁ♦గానిపథంబులఁ బోకు మయ్య! నన్
ద్రోవలు దప్పనీడ్చుచును ♦ దొందర పెట్టకు మయ్య! పూర్వు లే
త్రోవను బోయి రా తెలుఁగు♦తోషము లెంచకు మయ్య! నేర్పుమై
భావన సేయ వయ్య! బహు♦భంగుల నీకు యశంబు చేకుఱున్. ౬౨

వ. అంతరాయభయంబునను భిన్నదర్శను లగులోకుల నెల్ల నెట్లు మెచ్చింప వచ్చు నని యు జిచ్చవడి యున్న నిన్ను హెచ్చరింపఁ జనుదెంచితి. లోకంబునంతయు నేకాకృతి మెప్పింప దైవంబు వలనఁ గాదన నీ వన నెంత. కావున నిర్భయుండవై యుత్సాహంబు వాటించి నిరాఘాటంబుగఁ గృతిఁ బ్రారంభింపు మని దయాపోషణ మనస్తోషణ చింతాశోషణ శంకాపేషణ మృదుమధుర భాషణంబుల భాషాయోషారత్నంబు సంభాషించి తిరోహితయైనఁ దెలిసి యది యమ్మహాదేవి యఁగా నోకగాఁ దలంచి. ౬౩

కం. చింతామణిరూపిణివై, చింతామణివేదికపయిఁ♦జెలువలరెడు శ్రీ
కాంతామణి! భక్తోత్కర, చింతామణి యనుచు వినుతి ♦ చేయుదు వాణీ. ౬౪

కం. భళిరే! త్వన్నామాప్తిని, దళమే నిర్వక్రవాగ్వి♦ధానత మమరాఁ
దలమే త్వత్కరుణాకం,దళ మేనరు సోఁకు నట్టి ♦ ధన్యునిఁ బొగడన్? ౬౫

ఉ. నీరజపీఠవాసరమణీ! రమణీయమణీమయోద్ధమం
జీరకకింకిణీనికర♦శింజితఝుళఝుళంఝుళార్భటుల్
దోరముగాఁగ నిస్తులిత♦ధోరణి మీఱ నవారణంబుగా
నా రసన న్నటించుచు ఘ♦నంబుగఁ గూర్పఁగదమ్మ శ్రేయముల్. ౬౬

మ. సనయుల్ పూర్వకవీశు లాడని వచ♦శ్చాతుర్యమా లేదు; నే
జననీ! వచ్చియు రాక యాడిన మహి♦మ్మప్రీతి యొప్పార నో
య్యనఁ ద్వత్కంఠగభవ్యకావ్యసుమణీ♦హారంబునం గ్రిందునై
కన నొప్పొపతకంబుచందమున మ♦త్కావ్యంబు లాలింపవే. ౧౯

వ. అని ముకుళితకరుండనై యమ్మహాదేవింగూర్చి నమస్కరించి హర్షపులకితగాత్రుండనై దశకంధరమదసింధురవరసింధురపరమేచకకంధరాంగ సమర్పితంబైన మానుకీనప్రబంధంబు గుణబంధురపదధురంధరంబై వసుంధర నమంథరగతిఁ గవియుగంధరహర్షాకరం బగుననితలంచి మదీయాత్మారాముఁడగు శ్రీరాముని శుద్ధాంతరంగశుద్ధాంతరంగసంగతుంజేసి మోక్షఫలాపేక్షఁ దత్కమలాక్షు న్మత్కృతికి నధ్యక్షుఁగాఁదలంచుచుఁ దదుచితకథాన్వేషణపరుండనై యున్న సమయంబున.

కం. మాయమ్మ కనికరమ్మున, మాయమ్మయ, యవగుణంబు♦మాయమ్మగుఁ జు
మ్మాయమ్మయందు, నడవడి నాయమ్మిక, నమ్మిక మ్మ♦యమ్మ గుణమ్ముల్.

కం. కనకమ్మ సద్గుణంబులఁ, గనకమ్మ మదాళులకును♦గనఁ గమ్మ తెఱం
గునఁ గొమ్మలలో వెలయుటఁ, గనకమ్మ యనంగఁ గాంచె♦ఘనవిఖ్యాతిన్. ౨౦

ఉ. అయమ యొక్కనాఁడు భర♦తానుజరామసమేతరామమా
యో యన డాయవచ్చి తన♦యుల్ దనయుల్లముఁ బల్లవింపఁగాఁ
జేయ విధేయులై స్నుషలు♦చేరువఁ జేర వినోదవైఖరిన్
హాయిగ ముచ్చటించెను స♦ముంచితపుణ్యకథాప్రసంగముల్. ౨౧

వ. వారెవ రెవ రనిన నేనును నాయనుజుండును. ౨౨

ఉ. రంగనయాంతరంగమొ హ♦రంగని స్నేహితు లెల్ల మోద మూ
రంగన, వేంకటేశపద♦రంగనటన్మతియై మనీషిసా
రంగనయప్రసంగ మల♦రంగ నయాంగవిధిజ్ఞుఁడై నమా
రంగన; సాటి వానికి ధ♦రం గన సాధుగుణానుషంగునిన్. ౨౩

ఉ. పూతయశోవిశోభితుఁడు♦భూనుతకంచనపల్లివంశవి
ఖ్యాతుఁడు నాదుమామ ధుత♦కల్మషహృన్నళినీసమర్చిత
శ్రీతరుణీశపద్యుగకు♦శేశయ వేంకటసుబ్బరావు శ్రీ
సీతమ పేరియాత్మభవ♦శిష్టపణాయితశీల రంగయున్. ౨౪

వ. నా మఱఁదలు. ౨౫

ఆ. పాలవాయి వంశ♦భవుఁడు గండీరావు, నరసమాంబయను నెడు♦తరుణియందుఁ
బ్రేమఁగాంచినట్టి♦రెండవకూఁతురు, రంగమ సుగుణగణ♦రంగమ యన. ౨౬

వ. అట్టిసమయంబున. ౨౭

కం. కనుఁగొనల దయారసము, ల్గునగునలాడఁగ నడిమి♦కొమరుఁ ముగురం
దును గనుఁగొని సుబ్బన్నను, నను సుగుణవతీమతల్లి♦నాతల్లి యనెఁ. ౭

చ. తెలియఁగ వింటెఁ బుత్ర! భవ♦దీయపితృవ్యులు పిన్ననాఁటఁ బా
టిలిన మరాటబాసను బ♦ఠింపఁగఁ గోసలరాజపుత్రిఁ దా
నలరుచు బంతిదేర్ల యొడ♦యంపు వివాహము నాడఁబూన వా
రల కుదయించు వెన్నుఁ డని ♦ రావణుఁడుఁ వెస వారి నేఁచుటల్. ౮

కం. వినిన స్నీవాకథల, న్వినిపింపుము నాయనా! స♦విస్తరముగ నా
విని యెఱుఁగ నేను దల్లీ! మును దీని నదెట్లు పలుక ♦ మొనయుదు ననిక. ౯

తే. రాదుగా నాకు నా మహా♦రాష్ట్రభాష
పెద్దకాలంబు నందలి♦వినికి గలదు
దాన దిఙ్మాత్ర మెఱిఁగించు♦దానఁ గొంత
బుధులవలనను దెలియుము♦పూర్ణముగను. ౧౦

వ. అని యించుకించుక వచించుటయు నిట్టి నిస్తులప్రశస్తకథాప్రపంచంబు [illegible]
నవిస్తరంబుగ నెఱుంగ బద్ధదీక్షుండనై విచారించుచున్నెడ. ౧౧

సీ. శ్రీరామచంద్రప♦దారవిందార్చనా, నిస్తులశేముషీ♦నిధి యెవండు
ప్రాకటలంకల♦పల్లెసద్వంశస, న్మహనీయమౌక్తిక♦మణి యెవండు
ద్రావిడహూణాంధ్ర♦దేవభాషాదిష, డ్భాషావిధిజ్ఞమ♦నీషి యెవఁడు
ధీరవీరాసామి♦సూరిప్రమోదద, ర్ధనశీలశీతల♦ధాముఁ డెవ్వఁ
తే. డట్టివేంకటసుబ్బార్యుఁ♦డార్యహితుఁడు, గోర వాల్మీకునకు మున్ను ♦ నారదుండ
పోలె నెఱిఁగించి పెరరేచెఁ♦జాలఁగనను, రమణ నీకావ్యవిరచనా♦రంభమునన. ౧౨

వ. ఆయనకు. ౧౩

ఆ. కులము దానితోడు ♦ చెలువారెఁ బాండితి
వన్నెదెచ్చె రెంటి ♦ కెన్నగుణము
పోఁక లాకు లున్నఁ ♦ బొలుపారఁ దాంబూల
మునను వన్నె సున్న♦మునను గాదె. ౧౪

అయోధ్యాపురీచరిత్రము.

శా. ప్రాజ్ఞగ్రామణీ యాతఁ డిట్టులను సౌ♦భ్రాత్రంబుపెంపార నో
విజ్ఞానప్రియ! పుణ్యతీర్థముల సే♦వింపంగ మున్నే మహా
విజ్ఞుల్ దోడయిరాఁ జరించునెడలం ♦ బ్రీతిం గనుంగొంటి రా
మాజ్ఞం బాలితమై రహించిన యయో♦ధ్యఁ దేవతారాధ్యనుఁ. ౧౫

తే. ముక్తిదాయకపట్టన♦ములను మొదలఁ
గొలువఁబడు నెద్ది యపరవై♦కుంఠ మెద్ది
చూడఁజూడంగ మఱియెంత ♦ చూడఁజూడ
వలయునని యాస నెయ్యది ♦ గొలుపుచుండు. ౫౭

వ. అట్టి యయోధ్యాపురి చరిత్రం బించుక వచించెద విను మని యిట్లనియె. ౫౮

కం. శ్రీరాములు వైకుంఠముఁ, జేరం జనుటయును బిదపఁ ♦ జిత్రము! సరయూ
నీరము లయోధ్య ముంచిన, వారావృత మగుట విన్న♦వాఁడవుగావే. ౫౯

కం. ఆపగిదిని బహువర్షము, లాపగనీట న్మునింగి ♦ యవిదిత మయి యి
ట్టాపురి చెలంగ నుజ్జయు, నీపురవల్లభుఁడు సర్వ♦నీతిపరుండుఁ. ౬౦

ఉ. ఖండితశాత్రవోత్కరుఁ డ♦ఖండపరాక్రమశాలి క్షోణిపా
ఖండలమూర్తి సర్వనవ♦ఖండయుతావనిమండలప్రజా
మండలరక్షణాత్తశుభ♦మండనకీర్తివిహారి విక్రమా
ర్కుండనుధారిణీశుఁ డొక♦రుండు రహించెఁ గదా యతం డెదన్. ౬౧

మ. సకలోర్వీస్థితదైవతీర్థనగరీ♦సందర్శనోత్సాహియై
యకలంకప్రతిభావిశేషమున ది♦వ్యక్షేత్రతీర్థాపగా
నికరాటీకనలోలుఁడై చనుచు న♦న్వేషించె నిద్దానికై
యకటా! రిత్తశ్రమంబె గాని కనలేఁ♦డయ్యెం బురీరత్నమున్. ౬౨

తే. శాస్త్రచోదిత మైనట్టి♦స్థల మదెల్ల, జలమయంబయి యుండుటఁ♦జాలవగచి
తెలిసి పెద్దలవలనను♦గల తెఱంగు, ధైర్యనిర్జితకాంచనా♦హార్యుఁ డపుడు. ౬౩

కం ఏతాదృశ మగుక్షేత్రము, భూతలమునఁగానకుంట♦పోలునె? జనతా
పాతకనిపాతనార్థము, ఖ్యాతి యొసంగినను మృత్యు♦వైనను మేలౌ. ౬౪

కం. అని నిశ్చయించి నారా, యణుఁగూర్చి తపస్సమాధి ♦ నతినిష్ఠఁ జరిం
చినఁ బెక్కుహాయనంబులు, జనపాలునిఁ జూచి శౌరి ♦ సదయుం డగుచున్. ౬౫

వ. భవదీప్సితం బెయ్యది? వేఁడుమనుటయు దేవా! భవదీయరామావతారంబున నయో
ధ్య యెట్టులుండె నట్టివిధంబున లోకంబునకు గోచరింపవరంబొసంగ వేయనపుడు.

కం. శ్రీకాంతుఁడిట్టు లను నో, భూకాంత! త్వదీప్సితంబు♦పొసఁగ దొసంగన్
ఈకాంక్ష విడువు మనఁగ ర,మాకాంతునితోడఁ బల్కు♦మానవవిభుఁడున్. ౬౭

కం. అసువుల నైనను నీ కిదె, యొసఁగెదనే కాని విడువ♦నోర్తునె కోర్కెన్
వ్యసనం బైనను రానీ, యస మైనను గాని విడువ♦నాశయ మనినన్.

మత్తకోకిల. అంత సాహస మేల యయ్యధ♦రాధిపా! విను మొందు నీ
స్వాంతవీథిని జూడ నెయ్యవి ♦ యాశచేసెదొ యట్టిచో

ల్లెంతయుం గన నిచ్చ నించుక ♦ యిచ్చగించిన నీధునీ
కాంత నా జనపాలవర్యుఁడు ♦ కాంక్షఁజేసెను గొన్నిటిన్. ౯౯

వ. అవి యెయ్యవి యనినఁ గైకయీకోపభవనంబును, శ్రీరామజననస్థలంబును, గాంచన సీతయు, గోప్రతారం బనురామనిర్యాణఘట్టంబును, హనుమాన్గడియు, నాగేశ్వరాలయంబు ననుకొన్ని ప్రదేశంబులు నేఁటికిని దృశ్యమానంబులై విక్రమార్కయశస్స్తంభంబులుం బోలె నొప్పుచున్న యని. వానిపెంపుసొంపు వర్ణింపవలంతినేయని మఱియు. ౧౦౦

కం. అచ్చోట్లు విడిచి సరయువు, విచ్చేయుటకతన నేఁడు ♦ వీక్షింపఁగనా
నచ్చపుఁజందురు రేకన, మెచ్చులుగొలుపుచుఁ బురీస ♦ మీపమునందున్. ౧౦౧

తే. స్వామినిర్యాణఘట్టవీ ♦ క్షణముచేతఁ, గనుల నీరూర కుండినఁ ♦ గాఁడు నరుఁడు
కైకయీకోపభవనవీ ♦ క్షణముసల్పి, యామెఁ దిట్టనిమానవుఁ ♦ డవని లేఁడు. ౧౦౨

ఉ. క్రాలెడినెట్లు కాశి మణి ♦ కర్ణిక, యుజ్జయనీపురిన్ మహా
కాళనికేతనం బెటులు ♦ ఖ్యాతివహించెనొ, నైమిశాటవిన్
వాలెడుఁ జక్రవాపి యెటు ♦ భాతి జితకీర్తిని, న ట్లయోధ్యఁ దీ
ర్థాళుల నుత్తమోత్తమము ♦ నై శుభదం బగు గోప్రతారమున్. ౧౦౩

ఉ. వేలుపుటాలపాలనగ ♦ వెల్లియొ? కాదు; ద్రవించిపాఱు తా
రాలలనామనోహరుని ♦ రశ్ములరాశియొ? కాదు; సత్సుధా
జాలమొ? కాదిఁకేమనినఁ ♦ జాహ్నుతరం బగుక్రొత్తముత్తెపు
న్నీలల తేట గావున ధు ♦ నీజలముల్ సికతాళి తారచూ
ర్ణాళి గతిన్ గనంగ నగు ♦ నందు నమేయపు లోఁతు గల్గియున్. ౧౦౪

కం. కాంచనజనకాత్మజ రేఁ, గాంచఁగ నగుఁగాని పగలఁ ♦ గనరా దెటులే
నెంచఁగఁ దామా సీతా, చంచలనయనామరీచి ♦ సంపత్తతులన్. ౧౦౫

కం. రంగగుహారతి సీతా, మంగళదేవత కొసంగ ♦ మణిగణదీప్తిన్
బంగారొడలయినం దమ, యంగంబుల మఱచుచుందు ♦ రయ్యా దిదృక్షుల్. ౧౦౬

మత్తకోకిల. వేయిగన్నులు గోరితిం బృథ ♦ వీసుతం గనువేళల
న్వేయి జిహ్వలఁ గోరితిం ధర ♦ ణీసుతన్ వినుతింపఁగా
వేయిశీర్షము లాసచేసితి ♦ వెండి ధ్యానము చేయఁగా
వేయు నేటికి జన్మమేటికి ♦ వేదిజం గనకుండినన్. ౧౦౭

కం. హనుమాన్గడిని విచిత్రము, విన మా వివరింతు వినఁగ ♦ వీనులవిందౌఁ
గన మానస ములరదొకో, ఘనమానమువానరాళి ♦ గల దచ్చోటన్. ౧౦౮

కం! అటవీచరాళికొఱకై, విటపులదట్టంబునైన ♦ విపినము గల ద
చ్చట నుండు మొండితోఁకలఁ, జటులతరాకారములను ♦ శాఖామృగముల్. ౧౦౯

చం. అసమానప్రతిపత్తి నైన, విపులా♦హ్లాదంబుచే నైనఁ, బా
యసమున్ లోకులు సంఘటించికొని రా ♦ హాండాలతో వానరుల్
విసుమానంబుగ బారుతీరి నియమా♦విచ్ఛిత్తిమైఁ బోరకే
లసమానం బగుకీర్తిఁ గైకొనెడులీ♦లల్ నిత్యదధ్యోదన
గ్రసనాభ్యాసులు వైష్ణవుల్ గుడిని నే♦రం జాల రో మిత్రమా! ౧౧౦

చం. అనఁగననంగ మాటలు త♦మంతటనే విరమించు; బాష్పముల్
గనఁగఁగనంగ మోదమునఁ ♦ గాల్వలువాఱును గంటఁ; దత్కథల్
వినఁగవినఁగ వీనులకు ♦ విం దయి పొందుగ విస్తరిల్లు; నే
మనఁగ! మనంగనేల నగ♦రాద్భుతలీలలు చూడకుండినన్? ౧౧౧

కం. రామప్రసూతిగృహముం, గామించి యెటైనఁ జూడఁ♦గా నోపినచో
భూమిఁ బ్రసూతిగృహంబును, గామించియ యైనఁ జూడఁ♦గా నోపఁ డయా.

మ. తతశృంగారకళానిధాననగరీ♦ధౌతాబ్జదృగ్గేహినీ
ధృతరత్నాయితమంగళాయతనసు♦శ్రేణుల్ దగు న్పేటలై;
పతకంబో యన సూర్యవంశభవభూ♦పాలావళీసంతతా
ర్చితనాగేశ్వర దేవతాయతన ము♦చ్ఛ్రి మించు మధ్యంబునన్. ౧౧౩

వ. అని వచియించె నిట్లు మదీయజనయిత్రీప్రేరణంబున సుహృదీరితంబగు శ్రీకౌస
ల్యాపరిణయకథను ప్రబంధంబుగ రచియింపఁ గౌతుకాధీనమానసుండనై. ౧౧౪

కం. కారయిత రాముఁ డట న, త్సారమతిన్ శ్రోత రామ♦చంద్రుం డట నా
నేరమి నేరం బగునే? కారాకూరంబులేల♦కడఁగెదఁ గృతికిన్. ౧౧౫

చం. అరయఁగ మత్పురాకృతమ♦హాసుకృతంబు లనెట్టివో యహా?
ధరణిని లభ్య మయ్యె విబు♦ధప్రకరస్తుతమంజువాణి నా
కరుదుగ, దాని నే జనకుఁ♦డై హవణిల్లుట ధారవోసెదన్
వరహితధర్మ దానగుణ♦భాసితకీర్తికి రామమూర్తికిన్. ౧౧౬

వ. అని తత్ప్రసాదపరిలబ్ధకైయతనిసన్నిధానంబుఁ గల్పించుకొని నుతించెద. ౧౧౭

**కృతిపతినుతి.**

తే. ధరణి దోఁగాడుచును బోవఁ ♦ దల్లిఁ జేరఁ
గాలు సేతులు డస్సిన ♦ నేల బొజ్జ
సోఁకఁగఁ బరుండి తలయెత్తి ♦ చూచుచిన్ని
చూపులను నేడు నన్నిటు ♦ చూడవయ్య. ౧౧౮

చం. గునగునఁ దప్పతప్పటడు♦గుల్ చెలఁగం బరువెత్తుచుం దటా
లున మెపఁ గాఁగిలింప నొడి♦లో నెగఁబ్రాఁకఁగ ముద్దువెట్టుచు

న్జనని యిదేమి నాయన! య♦నర్ణ మురిపెంబున "నమ్మ! పాయి" యం
చనియెడు ముద్దునెమ్మొగము♦నందముఁ జూపఁగదయ్య రాఘవా! ౧౧౯

చం. మురిపెపుఁజుక్కబొట్టు, నును♦ముంగురులల్లినపింపిణీజడల్
పరఁగఁగ ముద్దుగూర్చు జున♦పాలును, సొంపగుపాలబుగ్గలు
న్దరహసితంబు, వక్షమున ♦ నాణెపుజందెము నొప్ప మౌనితో
సరసతఁ దోడుఁగూడిచను♦చారుతరాకృతిఁ జూపు రాఘవా! ౧౨౦

చం. బుగిలెడు సూర్ధ్వపుండ్రమును ♦ బుగ్గను జుక్కయుఁ, గమ్మవాసనల్
నిగనిగలాడు హారములు ♦ నీ టగుపోఁగులు, వల్లెవాటు, మే
ల్వగగల పచ్చదోవతులు ♦ పాదములం బసుపంటు లత్తుక
ల్నగుమొగ మొప్ప పెండ్లిహొయ♦లం గనిపింపర జానకీశ్వరా! ౧౨౧

సీ. తలఁబ్రాలు దోయిటఁ♦దాల్చియొండొరులను, మీఱు నుత్సాహంబు♦ మేరమీఱ
శిరమునఁ బోయుచోఁ♦గరముసోఁకఁ జెమర్చు, మేనుల నర్ధసీ♦మాలితంపుఁ
గనులఁ బరస్పరం♦బును జూచి చూడక, యరివాణ మది రిత్త♦దగుటయైనఁ
దెలియక కేల్సాఁచి♦ తెలిసి లోఁ గొదుకుచు, నాస్యబింబంటుల♦నావరింపఁ

తే. బసుపుపొడి హారిదళమూను♦పాత్రములన, ననుపమానవిలాసపి♦హారులైన
శ్రీవధూవరులార! మీ♦చెలువుచూప, నాకుసాక్షాత్కరింపుఁడీ♦ననుపుమెఱయ.

మ. తలఁబ్రాల్ దోయిట దోయిలించి తలమీఁ♦దం బోయుభూపుత్రికో
జ్జ్వలశోభాయుతబాహుమూలములపైఁ ♦ బార్శ్వస్థభామాళిపైఁ
జెలియూరుస్థలిపై సభాసదులపై♦సీతాస్యపద్మంబుపైఁ
దెలెపైఁ బాతరలాడుచూపులఁ బ్రసా♦దింపం గదే రాఘవా! ౧౨౩

తే. చెలఁగి యుద్వాహపీఠి వ♦సించువేళ, నూతనాభ్యస్తచౌర్యసీ♦నోదములను
నెదురుకోలాడు మీసిగ్గు ♦ కుదురు బెదరు, కలికిచూపుల నామ్రోలఁ♦గులుకరాదె

మ. దరహాసాంకుర మొప్ప మోవిపయిఁ బ్రో♦ద్యత్కోపధవహ్ని చ్ఛటా
క్ష్యరుణీభూతము లైననేత్రములతో♦జ్యాకృష్టిబద్ధాంగుళీ
వరవిన్యాసముతోడ, భార్గవుని ని♦ర్భర్త్సింప నీవ్రాను ని
ష్ఠురబాణాగ్ని మదీయదుర్గతికిఁ గూ♦ర్చన్ భస్మసాత్కారమున్. ౧౨౪

చం. అడవికిఁ బోర కాల్నడ, ర♦యంబునఁ గట్టర నారచీర లి
ప్పుడ యని కైక వల్కినను♦బోణిమి వాసెనె? యశ్రు లూరెనే?
తడఁబడెనే పదాళి? ధృతి♦దప్పెనె? యేమియు మోము వాడెనే?
చెడెనె కడంక? యట్టి యతి♦చిత్రపుఁదాలిమి నా కొసంగరా. ౧౨౫

శా. రామా! రామయ! రామచంద్ర! రఘుపీ♦రా! యంచు వాపోవుచు
న్నామాపూరుషబాలకావళులు కాం♦తారప్రవేశోన్మతిన్

రా, మీ వెంట గృహంబు నూరు విడి యా♦రా వారి వంచించితో
స్వామి! మీ వెను వెంటఁ బర్వు లిడుమ♦త్స్వాంతంబు నూరార్పవే! ౧౨౬

ఉ. ప్రాణమువోలె నిన్ను నెడఁ♦బాయని సత్ప్రకృతిద్ధభార్య, య
గ్లానిని గొల్వ శేషగుణ♦లక్ష్మణుఁడుర్, వన మున్కిపట్టుగా
జానగుటం గదా వనికి♦సాగితి వర్మిలి; నేవిభూతియం
దేనియు నీకు వేఱు గల♦దే విభవంబు వచింపు తత్త్వముగ్? ౧౨౭

ఉ. దాసరితప్పు లన్నియును ♦ దండముతో సరినాథ! వీఁడు మీ
దాసతఁ గాంచె ని ష్ఠభయ♦దాన మొసంగఁగ నర్హమంచుఁ గా
కానుకు సాపరాధుఁ గృపఁ♦గావఁగఁ బల్కితి వట్లు వీఁడు మీ
దాసులదాసుఁ డై ష్ఠభయ♦దాన మొసంగెదొ తల్లి! జానకీ! ౧౨౮

చం. కలుగునటయ్య రామ! ధరఁ♦గాంచనవర్ణమృగం? బదేమి ధీ
కలిలమొ; యాస దోసమె యెఱుఁ♦గం గలదా? విను నీదుమాయయే
యలమెనె నిన్ను? ముప్పునిడె♦నయ్యలజన్నిద మయ్యవారి కర్
పలుకు యథార్థ మయ్యె నెటు♦పాలనసేసెదొ నన్ను మోహితుర్, ౧౩౦

చం. తెలివి దొఱంగి నీవు వెగ♦తిట్టితి వందురు నీమఱందినిర్
దెలియనివారు, రాక్షస తతి♦ర్ వధియింపఁగఁ బ్రాణనాథుఁడుం
బలికినబాస దీర్ప నటు♦పన్ని తుపాయముఁ గాక నీకునుం
గలుగునటమ్మ సీత! యొక♦కాలమునర్ భ్రమ మానసంబునర్. ౧౩౧

తే. దండ్యులే లేరు నా కని ♦ ధరణితనయ
తన్ను భర్త్సించు దైత్యకాం♦తలను మనిచె
శర ణటన్నను బ్రోతు నర్♦శపథ మూని
గ్రుడ్డుఁ బెకలించితివి కాకి♦గోడుకుడువ
సేవ్యతరు లేరొ మీలోనఁ ♦ జెప్పవయ్య? ౧౩౨

శా. లీలాలోకనమాత్ర లోకములఁ గ♦ల్పింపన్ హరింపంగనౌ
లీలామూర్తివిం పామరు, బలెనె జా♦లిం బొంది తేలా కడన్?
ఏలా క్రోఁతుల నాశ్రయించితివి తం♦డ్రీ! కట్టి తావార్ధి? స
చ్ఛీలా! ధాత్రిని గర్మయోగమ యను♦ష్ఠేయంబుగాఁ దెల్పనో. ౧౩౩

ఉ కర్మము భుక్తమైన మఱి♦గాని లభింపదు ముక్తి యన్న యా
కర్మఠవాక్యపద్ధతులఁ ♦ గాఱియఁ జెందితిఁ గాని రామ! నీ
వర్మిలిఁ బక్షిరాజునకు ♦ నక్షయసౌఖ్యము లీయఁ జూచి నే
శర్మద మైనమీదయ క♦సాధ్యము లే దని నిశ్చయించితిర్. ౧౩౪

ఉ. గాటపుభక్తిఁ జిత్తమున♦క్ష్మాతనయాప్రమదైక హేతువున్
నాటుచు సేతువున్ దనుజ♦నాయకపట్టనధూమకేతువున్
జీటికిమాటికిన్ హృదయ♦సీమ ధరించి భజింతు నాథను
మ్మేటిని బాపశైలశత♦కోటిని ముక్తివధూటిపేటికిన్. ౧౩౫

ఉ. పక్కికి మోక్షమున్ దనుజ♦వానరనాథులకుం బ్రభుత్వము
ల్గ్రక్కున నీవి నీదయకు ♦ లక్ష్యము లందురు, తేర కిచ్చితే?
యెక్కటిపోరఁ బ్రాణములఁ♦నీయఁ గడంగరె? యేమిలేని యీ
బక్కగువాఁగుఁబోతునకు♦భద్రముఁ గూర్చనఁగాదె సాక్ష్యమూ. ౧౩౬

ఉ. తమ్ములు బిడ్డలున్ సఖులు ♦ దానవవైరియ రాముఁ డన్నఁ గో
పమ్మున రజ్జులాడి దశ♦వక్త్రుఁడు నాటఁగ మేను నిండ నీ
యమ్ములు విశ్వతోముఖము♦లై మఱి విశ్వమయుండ వంచుఁ జి
త్తమ్మునఁ జూచె నంత్యదశ♦ధన్యత నట్టిది నా కొసంగుమీ. ౧౩౭

సీ. వసుధఁగల్గినమేలి♦వన్నెపుత్తడిబొమ్మ, దానగుణాకల్ప♦ధరణిజాత
రత్నగర్భాగర్భ♦రాజితసురమణి, రామనీలఖచిత♦హేమభూష
దనుజారిరామశ♦తఘ్నికి జానకి, నతపంకప్రక్షాళ♦నచణసీత
నాథవక్షస్థలీ♦నవ్యయోజనగంధ, భక్తసంఘాతంబు ♦ పట్టుఁగొమ్మ
తే. దైత్యకులవల్లికాకోటి♦దళనకమల, జనకధరణీతలేశ్వర♦సవనఫలము
మైథిలీదేవి మోక్షసం♦పదలదీవి, నాకు సాక్షాత్కరించుత♦నాథుఁగూడి. ౧౩౮

సీ. వాసవమణినీల♦భాసురగాత్రుండు, చారువీరాసన♦సంస్థితుండు
వామజానుస్థిత♦వామకరాబ్జుండు, జ్ఞానముద్రాంకాప♦సవ్యకరుఁడు
మణిమయకోటీర♦మండితశీర్షుండు, శ్రీవత్సకౌస్తుభ♦చిహ్నితుండు
రాణియై జానకి ♦ రాణింప డాపల, శస్త్రనీరేజాత♦హస్త యగుచు
తే. వెలసి, తమ్ములుఁబావని ♦ కెలనఁ గొల్వ, లోకములనేలు నతజన♦శ్రీకరుండు
రమ్యగుణకీర్తి పట్టాభి♦రామమూర్తి, వాయక వసించు నామనః♦పద్మపీఠి. ౧౩౯

ఉ. అన్న యటంచు నమ్మి పర♦మాపదఁ బాపినతమ్ముఁగుఱ్ఱ న
నన్న పొకాలుమంటి, వతి♦వంచును సత్యరతుండ వంచు లో
నున్నకఠోరగర్భవిపి♦నోర్విని ద్రోసితి వంచనన్ సతిం,
గన్నసుతాళి వీథులను♦గాథలఁ జెప్ప వినంగ సైచితే
మున్నదొయింక నాదుగతి ♦ యుల్లమున న్నిను నమ్మియుండుటన్. ౧౪౦

ఉ. క్రోతిగఁ బుట్టినైన నినుఁ♦గొల్వక పోయితి; గ్రద్దనౌచు సం
ప్రీతిని బ్రాణ మియ్యఁగను♦మేకొననైతిని; భూజమూషికం

బై తగుసాయమును జలుప♦నైతిని; బోయత నోచు సాపడక్
జాతిఫలంబు లీయ; నెటు♦సార్థకమౌనో మదీయజన్మముక్. ౧౪౧

చం. అడవిని రాయినైన, గహ♦నాంతరమందలి గ్రద్దనైనఁ, గా
అడవిని దుష్టకాక మయి ♦ యూఅడివెట్ట, నయోధ్య వీథిలో
మిడికెడుకుక్కనైనఁ, దమి♦మీఅఁగ దండక వృక్షమైన, దం
దడి నిల జన్మమెత్తనుగ♦దా భవదాస్య విలోకనాప్తిచేక్. ౧౪౨

సీ. దొరకునే నాబోఁటి♦విరసమానసునకుఁ, దావకీనపదాబ్జ♦సేవనంబు
వెలయునే నావంటి♦విషసమేధునకును, దావకభక్తిసు♦ధారసంబు
చలుపునే నాయట్టి♦జాత్యైకమానియుఁ, ద్వజ్జన్మవేళ న♦భ్యర్చనంబుఁ
గలుగునే ననుఁబోలు♦ఘనతమోంధునకును, దావకీనముఖేందు♦దర్శనంబు
తే. ఏది గతి నాకు రక్షకుం♦డెవ్వఁ డయ్య, నీ వనాదృతిచేసిన ♦ నీరజాక్ష!
యన్యమేదియుఁ గోర నో♦నట్లుగాని, చాలు నీపాదభక్తి నో♦సంగితేని. ౧౪౩

మ. అవతారంబులు లేవె యవ్వి ఖలసం♦హారంబునుం జేయవే
యవి నీనామసదాఽవ్యయాభిరుచి నే♦లా పొందవం చాత్మలోఁ
దవ్రలం జింతన సేసిచేసి కలత♦త్త్వంబెల్ల నేఁ గంటి రా
ఘవ! దివ్యామృతలబ్ధజన్మ మొనరం♦గా లేమినిం గాదొకో. ౧౪౪

సీ. క్షోణీసురాత్మజా♦సుప్రదామోదక, యని యన్న భవభయం ♦ బణఁగిపోవు
నీ నబ్బసుఖము ని♦ర్నిద్రతఁ జేసెద, వనిన నిత్యశ్రీల ♦ నమరు సుఖము
ధీరామలగుణవి♦హారా యటన్నను, శాపసంఘవిభంగ♦పటిమ బ్రాఁతె
యమితనయాన్వితా♦శ్రమవర్ధనా యన్న, నిత్యవిభూతిని ♦ నెగడఁగల్గు
తే. శరణు శరణంటి రామ! నీ♦బిరుదములను, మాముకాఖ్యార్ణ సంఖ్యాక♦ధామసంస్థ
వర్ణములఁ ద్రోసిచదివిన♦నిర్ణయమగు, నఱయొనర్చిననన్ను నీ♦యుపయశంబు. ౧౪౫

సీ. అవతారములు లేవె ♦ యూబాలగోపాల, మును ముక్తిఁ జేర్పంగఁ♦గనవు గాక
మంత్రము ల్మహి లేవె ♦ మననీయమహనీయ, తారకఖ్యాతికిఁ ♦ దగవుగాక
సత్యవాదులు లేరె ♦ సాతత్యవైయాత్య, రామవాక్యాభిఖ్య ♦ రాదుగాక
కరుణాపరుల్లేరె ♦ శరణన్నసురలెన్న, వైరిసోదరుఁ బ్రోవ♦లేరుగాక
తే. వ్రతులుధరలేరె యేకభా♦ర్యావ్రతస్థు, లెచటఁ గనరారుగాక ని♦న్నెన్నఁ దరమె
భక్తరక్షణనిస్తంద్ర♦పార్థివేంద్ర! రమ్యగుణసాంద్రపట్టాభి♦రామచంద్ర! ౧౪౬

సీ. బాజాఱిజనములు♦నీజాఱి గోఁజాడ, బేజాఱుపడినట్టి♦వితముతోడ
తహాశీలుదారుల♦తహతహపాటులఁ, గలఁతచెందినబుద్ధి♦యలఁతతోడ
గ్రామైకరాత్రంబు♦గా దివసైకభు, క్తంబుగాఁ బడుప్రయా♦సంబుతోడ
క్షయము కారణముగ ♦ స్వద్వారపర్యంత, గమనాగమనభవ♦శ్రమముతోడఁ

తే. బలుకఁ గడఁగితి నీమాతృ♦పరిణయంబుఁ
జెడుగునుడుగుల నుడిపి నా♦నుడులఁ గృతిని
గడఁగనంగను జేయుమా ♦ కరుణమీఱ
రక్షితామరలోకేంద్ర♦రామచంద్ర! ౧౪౭

సీ. పట్టునిగొడుగులు♦పవలింటిమబ్బులు, కరదీపికలు తటి♦ద్గణము లిరులఁ
గైవారములు మేటి♦ఘంటాపథంబులు, పటకుటీరంబులు ♦ పాదపములు
పాకశాలలు వృక్ష♦వారమూలంబులు, పచ్చడిమెతుకులే ♦ పాయసములు
తోటితలారులు♦త్రోవతోడులు నెడ,తీయనిచర్చ మా♦దిగలరచ్చ

తే. గాఁగ నోరంతప్రొద్దదో♦కారణముగఁ, బొట్టకొఱకునుదిరుగు నా♦బోఁటు లేడ ?
నిన్నుఁ గావ్యముఖంబున♦నెన్ను టేడఁ, దావకీనకృపాదృష్టి♦దవుల కున్న? ౧౪౮

సీ. సత్త్వభక్తిక్షీర♦సంక్లిన్నమై నిర, తామలశ్రద్ధాసు♦హల్య మగుచు
నమరుకౌసల్యాహ్వ♦దాలవాలంబున, విష్ణుపదధ్యాన♦బీజ మెసఁగ
నా జిదోహదకారుఁ♦డను వేలరక్తి సు,ధాభిషేకంబున♦ననువుపఱుప
నంకురమై గాధి♦జావితమై యేచి, మృదులసీతాలతా♦వృతము నగుచు

తే. నలువముక్కంటిపట్టుఁగొ♦మ్మలకుఁ బ్రాఁకి,కమలజాతాండకర్పర♦కాయమాన
మొరసియవ్యయఫలదమై♦యొప్పు రామ,కల్పమిదుఁగాక నా మనః♦కాంక్షితములు.

ఉ. ఆసురశిక్ష భూమితన♦యాగ్నిప్రవేశము కాకరక్షణం
బాసరమాధవాభయము♦నంబుధిబంధన మాంజనేయసే
వాసుకృతంబు పుష్పకని♦వాసము కార్ముకభంజనంబు మే
ధాసుభగత్వ మోక్షదక♦థల్ దిగధీశవిధిస్మరేశు లా
వాసపటాళి వ్రాసి యతి♦భక్తి భజించెడి రాముఁ గొల్చెదన్. ౧౫౦

చం. క్షితిపయిఁ బుత్రభిక్ష శచి♦కిం, బతిభిక్ష సురప్రవంతికా
సతికిని, జీవభిక్ష దివ♦సప్రభుసూతికి, గౌతమర్షికిన్
హితగతిఁ బత్నిభిక్షఁ, ద్రిది♦వేశుల కస్థలితాన్నభిక్ష, నా
యతమతి నిచ్చు వేల్పు పర♦మాత్ముఁడు నా కిడు మోక్షభిక్షమున్. ౧౫౧

తే. రామచంద్ర! నుతుండు మున్♦రాగమునను
బాడ నీజన్మకథనంబు ♦ నాఁడు వినితి
రామచంద్రనుతుం డను♦రాగమునను
బలుకునీమాతృకథ మది ♦ యలర వినుము. ౧౫౨

# కథాప్రారంభము.

కం. శుకుని న్వర్జితకల్యం, శుకునిన్ ముఖకాంతిహసిత♦శోణమరీచ్యం
శుకుని న్వ్యాసమునీశశి, శుకునిం గని యనియెఁ బార్థ♦సూనునిసుతుఁడున్. ౧

చం. అడిగెడువారి కేమి యన♦యంబును జెప్పెడివారు గల్గఁ దా
రడుగక ప్రశ్న సేయ నగు ♦ నూఁకొను టంతియ కాదె? వేసటన్
బడలక చెప్పఁగా వలదె ♦ వారని ప్రేమ; ధనైకకాంక్షచే
నడిగెడియాచకుండు దెలి♦యంగ సమర్థుఁడె దాతృకష్టమున్? ౨

కం. అట్టుల కావున నిన్నా, కెట్టెట్టును గదలనీక ♦ యడుగఁగ మీరుం
బట్టుగఁ బ్రేమం జెప్పఁగ, బుట్టెను మఱిమఱియు నడుగ ♦ బుద్ధియు నాకున్. ౩

చం. హరి జనియించి తా దశర♦థావనినాథతనూజుఁడై తనున్
బోఁగొను నంచు రావణుఁడు ♦ పూర్వమె విన్కియుఁగల్గి కంసువై
ఖరి మహితాంతరాయములఁ ♦ గల్పన సేయక యున్నె? చెప్పుమా
ధరణిపుజన్మకర్మచరి♦తల్ హరి యాతనియందుఁ బుట్టుటల్. ౪

కం. నాచెవులు హరికథ ల్వీన, వాఁచినయవి యానతీవె♦వాచవు లొలుకన్
వాచంయమివర్యా! నీ, వాచరితము రవికులోద్భ♦వాచరితంబున్. ౫

ఆ. అనుచుఁ దన్ను వేఁడు♦నభిమన్యుసుతుఁ జూచి, చిలుకజోగి కరుణ♦చిలుకఁ బలికె
నీదుప్రశ్న చూడ♦నిఖిలోత్తరం బయ్యె, రాకుమార! యుత్త♦రాకుమార! ౬

కం. చిత్రము దశరథుసచ్చా, రిత్రము వినుమా యరీణ♦రీతి న్వినుతున్
గాత్రము గగ్గురుపొడువఁ బ, విత్రము భవపంకహృతిప♦విత్రం బగుటన్. ౭

కం. సాధువిరోధులు జనధన, మేధాబలముల నదెంత ♦ మీఱుచు నున్నన్
సాధింపలేరు సుజనుల, సాధువుల న్మాధవుండు♦సంరక్షించున్. ౮

ఉ. అందనిమ్రానిపండు కడు♦హ్రస్వనరున్, భృశనీచలోభి కిం
పొందుయశంబు, మందునకు♦నుత్తమసాహితి, పాపజాతికిన్
డెందమునందు బల్దయ, క♦డిందిపనుల్ నిఱుపేద, కెట్లటం
చుందురు వైర్యసాధ్యను న♦యోధ్యను లోకులు శత్రుకోటికిన్. ౯

తే. నేల గలయంతపట్టును ♦ నేలఁ గలిగి
కోఁచలై నృపు లరగట్టఁ ♦ గోసలపురి

భూజనములకు నైలింప♦భూజ మనఁగ
రమణ విహరించు రఘుధరా♦రమణుఁ డధిప. ౧౦

వ. నిరఘుం డైన యారఘు వొక్కనాఁడు సర్వతంత్రస్వతంత్రు లగుమంత్రులును, బరమవసుక్షీరాతువులగురాతులును నుచితానుచితవివేకులగుప్రాడ్వివాకులును, నాగామికశుభాశుభవిజ్ఞు లగుదైవజ్ఞులును, సకలకళాధాను లగుధీరులును, నిజప్రతాపహాసితసూరు లగుశూరులును, వినయరసామంతు లగుసామంతులును గొల్వఁ బేరోలగంబున నున్నయెడ దౌవారికుం డరుదెంచి. ౧౧

కం. ఊరు విదర్భాపురమఁట, వారు పురోహితులఁట జన♦వరుఁ డనుపంగం
గూరిమిని వచ్చినారఁట, వారికి మీదర్శనంబు♦వలెనఁట దేవా. ౧౨

కం. దేవర! వచ్చితిఁ దెలుప ని, దే వరమతి యొప్ప నిలిపి ♦ దేహాలికడ నే
దౌ వారికి సెల వెయ్యది, దౌవారికునకును ముదల♦దయసేయుఁ డనన్. ౧౩

వ. తరణికులాభరణం బాదరణంబున వారల రాని మ్మనుటయు వారలు చనుదెంచి యాశీర్వచనపూర్వకంబుగ ౧౪

స్వాగతము. తారసిల్లి యుఁ♦దారనభంబుల్, గారవించువడి ♦ గ్రావముల స్నీ
చారుకీర్తి; సుఖ♦సంపదయే? యం, చారయంగ నృపు♦స్వాగత మిట్టుల్. ౧౫

వ. రఘుమహారాజును వారల నుచితసత్కారవిధుల మన్నించి యర్హాసనాసీనులం జేయఁబనిచి తదాగమననిదానం బడుగుటయు వారలు ౧౬

కం భోజుఁడు యాచకనిర్జర, భూజుఁడు మాదాంధవైరి♦పుష్కరజాతాం
భోజుఁడు జననుతసద్గుణ, భాజుఁడు మీసేమ మడుగఁ ♦ బంపె న్మమ్మున్. ౧౭

వ. అతండు తనయనుజాత యగునిందుమతి స్వయంవరమహోత్సవంబునకు ౧౮

కం. ధామవంతులు సౌందర్యర, మావంతులు విక్రమమహి♦మావంతులు స
న్మావంతులు కులగుణసుమ, మావంతులు రండు శౌర్య♦మావంతులఁ రేన్. ౧౯

వ. అని యందఱున్నృపాలురకుం దెలియఁ బఱిచి మమ్ము మీకడ కీకమ్మనిచ్చి పుచ్చిన వచ్చితి మనుటయుఁ దమకమ్ముగ్రమ్మ నక్కమ్మఁ గరమ్మునఁ గరమ్మునికరమ్మగు కనికరమ్మునఁ గొని కని తదాహ్వానమ్మునకు మనమ్మున సమ్మతించి వారలఁ బోవంబంచి తనయంచున రమాకుమారు మాకుమారుఁ గుమారు మాఱుపఱుచు వేషమునీషాబలవిశేషంబుల మీఱుచు ౨౦

కం. తన యాకారము దోఁపఁగఁ, దనయాకారంబుతోడు♦తనయాకృతి శ్రీ
తనయాకృతివిలసిల్లెడు, ఘను నజునిం జూచి పలికె♦ గారవ మారన్. ౨౧

ఉ. వీరలవాక్యముల్ విని తె♦వీరుల కియ్యది యాత్మపౌరుషో
దారవిహారభంగి నరు♦దారఁ బొగడ్తకు నెక్కు వేళ; దో

స్సారము పేర్మి నీవు నవ♦సారసలోచనఁ గొంచు రమ్ము పు
త్రా! రహిమీఱ నీబల ము♦దాత్తయశంబు జగంబెఱుంగఁగన్, ౨౨

ఉ. సారముదంబు పేర్మి నవ♦శారమనోజ్ఞ గ్రహింప విప్రతీ
సారము మీఱఁ దారు భుజ♦సారమున న్నృపవర్యకోట్లహం
కారముతోడ మన్మథవి♦కారముఁ గూడఁగ దుష్టవాక్క్రియా
కారము లుగ్గడించి ప్రతి♦కారము సేయఁగఁ జూతురాత్మజా. ౨౩

ఉ. ఘోరచమూసమూహములు♦ఘోటులవారణవారణంబు లే
పార నపారమైన భట♦వర్గ మనర్గళరీతిఁ గ్రాలఁగాఁ
జేరి విదర్భరాజపురిఁ♦జెన్నుగఁ గన్నియఁ గొంచు నిర్భర
శ్రీ రహిమీఱ రమ్ము జయ♦శీలుఁడవై తనయా! రయమ్మునన్. ౨౪

కం. విను తనయా! వినుతనయా, వనిత నయముమీఱఁ దెమ్ము♦భద్రం బనుచున్
సనయముగా దీవించుచుఁ,బనివిను మని పనిచెఁ దోడు♦పడ సైన్యంబుల్. ౨౫

వ. ఇట్లు పంచిన నజుండును ౨౬

—అజమహారాజిందుమతీస్వయంవరమునకుం బోవుట.—

కం.ఇందుమతి లేని సౌఖ్యము,పొందొకపొందే తలంపఁ♦బూరుషమణికిన్
ఇందు మతి లేని సౌఖ్యము,పొందొకపొందే తలంపఁ♦బూరుషమణికిన్. ౨౭

వ. అని సముత్సాహంబున ౨౮

మ. చని కాంచెన్ వసుధేశనందనుఁడు భా♦స్వచ్చారువీచీశిఖా
యనశీతాంచితవాతడోలితసుడో♦లాబ్జాబ్జడోలాంతడో
లవలీలాప్రవిఘూర్ణమానవరటా♦లాస్యన్మిళిందాంగనా
కనదక్షీణజనేక్షణక్షణదదీ♦క్షాశర్మదన్ నర్మదన్. ౨౯

ఉ. నర్మదఁ గాంచి తే యనుఁగు♦నర్మద! నిర్మదలోకపాళికిన్
శర్మద, దృష్టిమాత్రకువి♦చారజనాఘవిదారణక్రియా
ధర్మద, స్నానలోలజన♦తాశమనేష్వపహాసిప్రహోదినీ
వర్మద, శీతవాతతట ♦ వర్తిసునర్తనజాతఘర్మదన్. 30

వ. అని చెలికానికిం జూపుచు డాయం బోయి 3౧

కం.నీవారము గ్రసియించుచు, నీవారిని గొనినవాని♦నిర్జరయువతుల్
నీవార మనుచు నందురు, నీవారము గావు మమ్ము♦నిందారుదయన్. 3౨

శా. ఆమందాకినిసంగమంబు మదిలో♦నాసించునే? యెంచునే
శ్యామాంగ న్యమునాస్రవంతిని? సర♦స్వత్యాపగం దేవకు



న్గామంబొప్ప రహఃప్రవర్తనల నా♦నందించునే యబ్ధియున్ ?
నీమందానిల మింత సోఁకుతఱి మే♦నిం బూర్వభాగీరథీ! ౩౩

కం. తనమనుమరాలి వగు నిన్
దనమనము విరాళిఁ దూలఁ ♦ దహతహఁ గను నీ
తనుమహిమయొ యటుగాక య
తనుమహిమయొ రేవ! నిజము ♦ దలఁప జలధియున్. ౩౪

## అజుని సేనపై వనగజంబు గవియుట.

వ. అని యజ్జవాలుపడగదొరయొజ్జ బొజ్జ బుజ్జగించు నజ్జలధిపతికజ్జలవతి వినుతించుచు ముజ్జగంబులకర్మరజ్జువులు నజ్జునజ్జుగ నుజ్జగింపంజాలు నజ్జలంబుల సజ్జకంపు సజ్జన నజ్జనపతి పరిషజ్జనంబులతో మజ్జనాదికంబు లొనర్చి యాయజ్జున నాపజ్జ నొక సజ్జహజ్జలంబుల సెజ్జ నున్న నట్టియెడ నట్టియగుట్టు మట్టుపడ నెట్టన మిన్నుముట్టె నదిట్టరూపంబునఁ గుట్టారంబులు పదఘట్టనంబుల నట్టిట్టు బిట్టుకొట్టుకొనియా దట్టించిన రట్టునఁ జెట్టులెల్ల నొక్కపెట్ట మొదలుముట్టఁ బట్టుచెడి నేలమట్టంబుగ వ్రాలఁ, గావలంబునకుఁ దావలం బైనయొక మదావిలమదావళంబు హేరాళంబుగ రొదాళంబంతరాళంబు వగుల సరాళంబుగఁ గవిసి పాళెంబు వేళాకోళంబుగా విచ్చలవిడిఁ బెచ్చు పెరిఁగి పొచ్చెంబు లేక హెచ్చిన నచ్చపుమచ్చరంబున సేనఁజొచ్చి క్రచ్చఱవచ్చి కచ్చునఁ బైవచ్చిన పెచ్చారులు పిచ్చలింపఁ గ్రొచ్చియు గాటంబుగ వాటంబుగ నాటిన గూటంబులఁ గట్టుటఁ గొట్టాడుఘోటంబుల కూటంబులఁ గూటంబులతోడఁ గరహాటంబులఁ బోలె నిరాఘాటంబుగఁ బీఁకి సాపాటంబుగఁ బాటనంబు సేసియు నఖండ కాండోద్దండ వేదండ ప్రకాండదండంబుల తుండంబుల శుండాదండంబునఁ బ్రచండంబుగఁ బట్టి చండరవపిచండిలదిఙ్మండలంబు ఖండఖండంబులుగ నేలఁ జమరుచుఁ జూపఱు సంచలింప సంచరింపఁ బంచబంగాళమైనపంచమంగళంబులును బచ్చముపాడైన నిగిడారుగుడారులును గలిగి వాఁడి దఱిఁగి వాడఁబాఱినసేనం జూచి ౩౫

కం. తామరకొలని దెఱంగున, బామరజనములను గజము ♦ పటుగతిఁ గలఁచెన్
ఏమఱఁ దగునే సేనల, కీమఱుకువఁ బాపవలదె ♦ హితమతి నగుచున్. ౩౬

కం. ఏనిక మదసహితం బగు, నేని కడిమిఁ గలనఁ దక్క ♦ నితరతలములన్
జేనికినిఁ జంపరా దన, నే నీక సైన్యమును దంతి ♦ యేపడఁగించున్. ౩౭

వ. అని ౩౮

కం. వాలెము నాతఁడు వైచిన, వాలెముకలఁ దూఱ నేల ♦ వ్రాలుచు జముప్రోల్
పాళెముఁ గొనెఁ గరి; నరపతి, పాళెము సంతోషమునను ♦ బరివర్తింపన్. ౩౯

వ. ఇట్లు జడిపింప బెడిదంబుగ నడిదంబున నడిచిన గజంబు పుడమిం బడుటయు నక్క
డిందిమగండు డెందంబునం గుందుచు ౪౦

కం. వెఱగొన నడిదము వైచిన, మొఱయిడుచుం జచ్చె గజము ♦ ముఱకంబఱఁగాఁ
బిఱుసు చెడి పిడుగు తాఁకున, నొఱగిలఁబడినట్టి గట్టొ♦కో యని తోఁపన్. ౪౧

ఉ. కారణమేది వారణని♦కారణకారణ మైనయీయసం
స్కారభవాఘమిట్టులు ని♦కారవిధంబున వచ్చెఁ గా; ప్రతీ
కారము సేయు టెట్లు? నుడి♦కారముచే నఘమాఱునే? నిజా
గారముఁ జొచ్చు టెట్లు? ననుఁ ♦ గన్నఘనుం గను టెట్లు పాపినై? ౪౨

మ. అనుచుం గూఱినవంత వందురుచు ను♦న్నంతం గడున్ వింతమై
వనకుంభీంద్రతనూవినిర్గతమహో♦భాస్వత్ప్రభాజాలముల్
ఘనమై దిక్కులఁ బిక్కటిల్లె, జనసం♦ఘుం బొప్ప నిశ్చేష్టమై
కనరాఁగ న్నడుమంత్రమందు నొకయా♦కారంబు తోరంబుగన్. ౪౩

కం. భగ్గున వెలుంగు దోఁచిన, ధిగ్గని చూపఱకు మనము ♦ దిటచెడఁ గాంతిన్
దిగ్గన మ్రాఁగన్నువడ, న్నిగ్గునఁ దరతరముచూడ ♦ నిపుణత నందున్. ౪౪

సీ. నగుమోముగలవాఁడు ♦ నగధామహిమధామ, వరధామమైయొప్పు ♦ వపువువాఁడు
తళుకుఁజూపులవాఁడు♦తతహీర మణిహార, పదహారికంధరా♦పదమువాఁడు
సొగియురూపమువాఁడు ♦ సురరాజరవిరాజ, దీప్తిరాజిత మైన♦తేజువాఁడు
హైమచాపమువాఁడు♦హరిహేతిరుచిభూతిఁ, బరిభూతియొనరించు♦వాలువాఁడు

తే. ఇంబుమీఱినమణికిరీ♦టంబువాఁడు
కంబుజిగిబిగినవ్వుకం♦ఠంబువాఁడు
డంబువెలసినవిపులవ♦క్షంబువాఁడు
చూడఁజూడంగఁ దోఁచె నా♦చూపఱులకు. ౪౫

వ. ఇట్లొక దివ్యపురుషుండు దోఁచి యజునిం జూచి ౪౬

కం. ఏను బ్రియంవదుఁ డనియెడి, గానకళానిపుణుఁడైన ♦ గంధర్వుండం
గానకెద మీఁదుమిక్కిలి, మౌనీంద్రు మతంగుఁ జెనక ♦ మాననికిమకన్. ౪౭

కం. ఆయన చుఱచుఱ నను నొ,రా యనుచును జూచి మదిని ♦ రాఁజఁగఁ గోపం
బోయన మత్తుఁడవై యిటు, సేయుట నేనుం గురూపుఁ ♦ జేకొను మనియెన్. ౪౮

ఉ. తిట్టిన బిట్టుకోపమునఁ ♦ దెల్వి వహించి స్మయాంధకారముం
దొట్టినయట్టికన్నులకుఁ ♦ దోరపుభీతు వెలుంగుఁ జూపి నా
కట్టెఁడిసేఁత నిట్టు లాడి♦గట్టితిఁ జెట్ట నటంచు నన్ను లోఁ
బట్టుగఁ దిట్టుకొంచు ముని♦వర్యునిపాదయుగంబు వట్టుచున్. ౪౯

